# మహర్షుల చరిత్రలు

## ఆరవభాగము

విద్వాన్ బులుసు వేంకటేశ్వర్లు ఎం. ఏ.




ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1988

MAHARSHULA CHARITRALU—Part VI

By

Vidwan Bulusu Venkateswarulu, M.A.,

*Edited by:*

Sri Mudivarti Kondamacharyulu.

T.T.D. Religious Publication Series No.

*First Edition:* 1988



*Copies:* 5000



*Published by:*
Sri Ch. VENKATAPATHI RAJU, I.A.S.,
Executive Officer,
T. T. Devasthanams,
Tirupati.

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507

# ముందుమాట



మహర్షులు మంత్రద్రష్టలు; మంత్రపతులు. పవిత్రమైన భారతావనిలో ఎందరో మహర్షులు అవతరించి బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై లోకోపకారకములైన ఎన్నో ఘనకార్యాలు నిర్వర్తించారు. ప్రజాసముదాయం ఆ మహర్షుల ఋణాన్ని ఎన్నటికీ తీర్చుకోలేదు. యుగయుగాల భారతీయ సంస్కృతినీ, విజ్ఞానమునూ విశ్వమునకు చాటిన ధర్మస్వరూపులు వారు. తపస్స్వాధ్యాయ నిరతులై, నిగ్రహానుగ్రహ సమర్థులై, త్రికాలజ్ఞులైన మన మహర్షుల గుఱించిన విషయములెన్నో, శ్రుతి స్మృతి పురాణేతిహాసాలలో కనిపిస్తాయి. వారు స్వయంగా ధర్మమును ఆచరించి లోకానికి ఆదర్శప్రాయులైనారు. అనేక ధర్మశాస్త్రాలు రచించి ప్రపంచానికి ఉపకరించారు.

నారదుడు సంగీతమునకు, పరాశరుడు స్మృతికీ, హోరా శాస్త్రమునకూ పెట్టిన భిక్షయే ఈ నాటి మేటి విద్వాంసు లందరికీ శరణ్యం. నేటికీ మన భారత భూమిలో అసమాన మహిమాన్వితులైన యోగి పుంగవులు తమ ధర్మప్రబోధముతో భక్తులను తరింప జేస్తున్నారు.

"మహర్షుల చరిత్రలు" అను ఈ పుస్తకములో ఆరణ్యకమహర్షి, ఉదంకమహర్షి, జైగీషవ్యమహర్షి, ధౌమ్యమహర్షి, బృహస్పతిమహర్షి, మృగశృంగమహర్షి, వ్యాఘ్రపాదమహర్షి, శుక్రమహర్షి మున్నగు వారి చరిత్రలు సాకల్యంగా పౌర్వాపర్య సందర్భ సమన్వితంగా విచారింపబడినవి. ప్రతి మహర్షి జీవితాన్ని గూర్చి చదివినపుడు పఠితలు ఎన్నో అమూల్య విషయాలు ఆకళింతకు తెచ్చుకొని ప్రయోజనం పొందగలరు. భారతీయు లందఱికీ మహర్షుల జీవితచరిత్రలు అవశ్య పఠనీయాలే.

అనేకములైన ఇతిహాస పురాణాలను చక్కగా అవలోడనముచేసి సర్వజనావబోధకమైన శైలిలో శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు రచించిన మహర్షుల చరిత్రలలో ఇది ఆరవ సంపుటము.

సనాతన ధర్మప్రచారమునకై శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారు వెలువఱుచుచున్న ధార్మికగ్రంథ పరంపరలో ఈ మహర్షుల చరిత్రలుకూడ ఆంధ్రపాఠకుల ఆదరాభిమానాలు సంపాదించుకొనగలవని మా విశ్వాసము.

తిరుపతి.
20 – 6 – 88.

పి. హెచ్. వేంకటపతిరాజు, I.A.S.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# విషయసూచిక

# మహర్షుల చరిత్రలు

## అరణ్యకమహర్షి

శ్రీ రామనామోపాసకు లయి పరమేశ్వరసాయుజ్యము నందిన మహనీయులలో అరణ్యకమహర్షి యొకఁడు. అరణ్యమునఁబుట్టి యరణ్యమునఁ బెరిఁగి యరణ్యమున మహాతప మొనరించి యరణ్యముతక్క నొం డెఱుఁగని యీమహనీయునికి అరణ్యకుఁడను పేరు వచ్చెను. ఈతని జననీజనకులయు మాతామహ పితామహులయు చరిత్ర మేమియుఁ దెలియరాదు.

## ఆశ్రమము

అరణ్యకమహర్షి రేవానదీతీరమున నొక యాశ్రమమును నిర్మించుకొని యందుఁ దప మొనరించుచుండెను. ఆతని యాశ్రమము పరమపవిత్రమై యొప్పారుచుండెను. ఆశ్రమమునకు దశదిశలను ఆమడమేర మహాప్రశాంత వాతావరణము వెల్లివిరియుచుండెను. ఆ మహర్షి తపఃప్రభావమున మహాక్రూరజంతువులు సైత మా యామడ మేర పరమశాంతితోఁ బ్రవర్తించును. రామనామోపాసకుఁడగు నా మహర్షి ధ్యానానంతరము చేయు రామస్మరణముతోఁ బ్రకృతి యంతయు శ్రుతిగలుపును. పండుటాకులు రాలినను, ఎండుకట్టెలు విఱిగినను, చీమచిటుక్కు మన్నను రామశబ్దముగనే యా యరణ్యమున ధ్వనించును; ప్రతిధ్వనించును; రామమంత్రము, రామధ్యానము, రామస్మరణము, రామపూజనము, రామచింతనము, రామమననము - వీనితోఁ గూడిన యారణ్యకమహర్షి యాశ్రమము శ్రీరామ మయముగఁ జెలఁగుచుండెను.

## శత్రుఘ్ను నిరాక

ఇట్లుండ శ్రీరాముఁ డశ్వమేధయాగ మొనరించి యశ్వమును విడిచినపిదప దానివెంట శత్రుఘ్నుఁడు పరివారసహితుఁడై యుత్తర ప్రాంతారణ్యములకు విచ్చేసెను. ఆతని దిగ్విజయయాత్రలో యజ్ఞా

శ్వము అరణ్యకమహర్షి యాశ్రమ ప్రాంతమునకు వచ్చెను. దాని వెన్నంటి వచ్చు శత్రుఘ్నుఁడును అరణ్యకమహర్షి యాశ్రమోపాంత మునకు వచ్చి, యది యారణ్యకమహర్షి యాశ్రమ మని యెఱింగి పాద చారియై తగువారుమాత్రమే కూడ రాఁగా, అరణ్యకుని దర్శించి స్వనామ గోత్రములు చెప్పుకొని మహర్షికి సాష్టాంగ నమస్కార మొనరించెను.

## ఆనందపారవశ్యము

అరణ్యకమహర్షి యపరిమితానందమున నాతని కర్ఘ్యపాద్యాదు లొసఁగి యాదరించి క్షేమ మడిగి వచ్చినపని యడిగెను. శత్రుఘ్నుఁ డన్న శ్రీరాముఁడు చేయు నశ్వమేధయాగము సంగతిఁదెలిపి యశ్వ మా ప్రాంతమునకు వచ్చుటచేఁ దాను వచ్చుటయు ఋషిసందర్శ నాశీర్వచన కుతూహలమునఁ బాదచారియై వచ్చి ప్రణమిల్లుటయుఁ జెప్పెను. శత్రుఘ్నుఁడు పలికిన రామనామమును విన్నంతనే యానందబాష్పములు ప్రవాహములై కన్నుల వెంటఁ బ్రవహింప దేహ మును మఱచి, కన్నులు మూసి మోడువలెఁ గదలిక లేక అరణ్యక మహర్షి శత్రుఘ్నాదుల కాశ్చర్యభయ సంభ్రమములు గల్గించెను. కొంతకాల మట్లు సమాధి నిమీలితాక్షుఁడైన మహర్షి పిదపఁ దెలివంది కన్నులు తెఱచి గద్గదస్వరమున రామనామశ్రవణము, రామసోదరదర్శ నము, రామస్మరణసమాధి కలిగినందుల కానందించి

"అల్పపుణ్యప్రదంబు లైనట్టియాగ
ములును యోగంబులును వ్రతంబులును సరియె?
తెగని సంసారబంధంబు ద్రెంచివైచి
క్షేమ మొనగూర్చు శ్రీరామనామమునకు."

అని పల్కెను.

## అరణ్యకునిఆత్మకథ

అంత శత్రుఘ్నుఁడు "మహాత్మా! నేను రామసోదరుఁడనై యున్నను నీ వందిన యానందములో వందవవంతైన నందలేనైతిని.

ఇంత మహాభక్తుఁడవు నీ కెట్లు రామనామము లభించెనో తెలుపు'' మని వేఁడుకొనెను.

శత్రుఘ్నకుమారా! చెప్పెదను. వినుము. "నేను బాల్యము నుండియుఁ దత్త్వజ్ఞానమును సంపాదింపఁ గోరి లెక్కలేనన్ని తీర్థములకుఁ దిరిగితిని. ఎక్కడను ఒక్కఁడును నాకు జ్ఞానము నుపదేశింపలేఁడయ్యెను. ఇట్లుండ నా పూర్వపుణ్యమున లోమశమహర్షి దేవలోకము నుండి వచ్చుచు నా కంటఁ బడెను. నే నాతని నెఱిఁగి పాదముల కెఱఁగి "మహాత్మా! సంసారసాగరమును దరించు నుపాయమును జెప్పి యనుగ్రహింపు'' మని ప్రార్థించితిని. దాని కాతఁడు "వత్సా! మార్గము లనేకము లున్నవి. కాని, రామమంత్రముకంటె సంసారమునుండి దాటించు మంత్ర మింకొకటి లేదు. ఇది వేదశాస్త్ర పరమ రహస్యము. ఇంతకంటె వేఱు వ్రతములు, క్రతువులు, యోగము, యాగము, దానము, మౌనము లేవు. రామస్మరణమున చండాలుఁడైనను ముక్తిపొందు నన్న వేదశాస్త్రవివేకము గల బ్రాహ్మణునిగూర్చి చెప్పనేల? నీవు నన్నతివిధేయుత నడిగితివి గానఁ జెప్పితిని. నీ వీ పరమరహస్యమును నాస్తికులకు, శ్రద్ధాహీనులకు, భక్తిహీనులకు, కామక్రోధాదిదూషితులకు, భక్తనిందకులకు, శాంతిరహితులకు, దురహంకారులకు నెన్నఁడును జెప్పకుము.'' అని పలికెను.

నే నపరిమితానంద మంది యాతని పాదపద్మములను విడువక "తండ్రీ! నాకు రామధ్యానపద్ధతిఁ దెలిపి కరుణింపు'' మని వేడితిని. అంతఁ గరుణారసము వెల్లివిరియ నా మహామహుఁ డిట్లు చెప్పఁదొడంగెను.

## లోమశమహర్షి ప్రబోధము

అయోధ్యలోఁ జిత్రమండపముతో నొప్పు కల్పవృక్షము మూలమున నవరత్నఖచిత మగు బంగారుసింహాసనమునఁ గూర్చుండి పూర్ణచంద్రుని బోలు ముఖపద్మముతోడను, దూర్వాదళ శ్యామ మగు దేహముతోడను, మణికిరీటముతోడను, నీలకుంతలములు, మకర కుండలములు, వైడూర్యమణులవంటి పలువరుసలు, పూవువంటి నాలుక, శంఖమువంటి

కంఠము, సింహోన్నతములు నగు బుజములు, శుభలక్షణములుగల నాసిక, వివిధభూషణములతో నొప్పు ఆజానుబాహువులు, లక్ష్మీయుతము, శ్రీవత్సాంకితము నగు విపుల వక్షఃస్థలము, గంభీరనాభి, గొప్ప ఉదరము, రత్నకాంచివంటి నడుము, మనోహరము లగుతొడలు, జంఘలు, వజ్ర యవాంకుశరేఖలు గల కోమలచరణములు గలిగి దేదీప్యమానుఁడగు శ్రీరామచంద్రుని మనసార ధ్యానించి, చేతులారఁ బూజించి నోరార భజించి, పరమ సులభముగ మోక్షము నందవచ్చును. ఇంతకంటెను సులభోపాయ మింకెక్కడను లేదు.''

"దేవా! వీనుల విందగు శ్రీరామకథ నాకు సంక్షేపముగాఁ దెలుపఁగదవే" యని నేను ప్రార్థించితిని. నాకోరిక మన్నించి యాతఁ డిట్లు తెలిపెను.

## రామకథా సంగ్రహము

"వత్సా! సంసారమగ్నులగు సజ్జనుల నుద్ధరింప విష్ణుమూర్తి త్రేతాయుగమున సూర్యకులమున నాలుగు రకముల యాకారములతో జన్మించి పూర్ణాకృతి యగుతాను రాముఁ డనుపేరు వడసెను. రాముఁడు తండ్రి యానతిఁ దలఁదాల్చి లక్ష్మణసహితుఁడై విశ్వామిత్రునివెంట నరిగి తాటకను జంపి కౌశికుని యజ్ఞభూమినిజేరి మారీచునిగొట్టి సుబాహునిఁ జంపి యహల్యాశాపవిమోచనముఁ గావించి మిథిలకేఁగి శివధనుస్సు విఱిచి సీతను బెండ్లాడెను. రామునకుఁ బదునైదవ వత్సరము సీత కాఱవవత్సరము, పండ్రెండేండ్లయినపిదప దశరథుఁడు రామునకు యౌవరాజ్యాభిషేకము చేయఁదలఁ పెట్టెను; అది కైకేయీ వరద్వయమున జరుగకపోఁగా, రామునిఁ బదునాలుగేం డ్లరణ్యవాసము చేయుటకు, భరతుని యౌవరాజ్యము ననుభవించుటకు నేర్పఱిచెను.

రాముఁ డంత సీతాలక్ష్మణసమేతుఁడై బయలుదేఱి మూఁడు దినములు జలాహారము, నాలుగవ దినమున ఫలాహారము గైకొని యైదవ నాఁడు చిత్రకూటముఁ జేరి యందు బండ్రెండేండ్లు నివసించి పదుమూఁడవసంవత్సరమునఁ బంచవటియందు కాముకురాలగు శూర్పణఖను

విరూపను గావించెను. పిదప జ్యేష్ఠకృష్ణాష్టమినాఁడు రావణుఁడు వచ్చి సీతను గొనిపోవుచుండ నామె యింటలేని రామునికై రామ రామ యని యేడ్చెను. ఆ యేడుపువిని జటాయువు రావణుని కడ్డువెళ్ళి యాతఁడు ఱెక్కలు నఱుకఁ గ్రిందఁబడిపోయెను. సంపాతి వానరులకు సీతజాడ చెప్పెను. మార్గశిరశుద్ధ యేకాదశినాఁడు హనుమంతుఁడు మహేంద్ర పర్వతమునుండి యెగిరి రాత్రికి లంకనుజేరి తెల్లవాఱుకట్ట సీతను గని సంచార ముడిగి విశ్రమించి, ద్వాదశినాఁడు శింశుపావృక్షము నెక్కినాఁటి రాత్రి చేతులు జోడించి సీతకు నమస్కరించి నమ్మకము కలుగునట్లు పలికి త్రయోదశినాఁడు అక్షకుమారుఁడు మున్నగురాక్షసులఁజంపి చతుర్దశినాఁడు ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమున బద్ధుఁడైనట్లు నటించెను. రాక్షసు లానందించి యాతనితోఁకకు నూనెగుడ్డలుచుట్టి యంటింప దానితో నాతఁడు లంకాదహనము కావించెను. పూర్ణిమనాఁటికి హనుమంతుఁడు తిరిగి మహేంద్రగిరికివచ్చి వానరులతోఁ గూడి యైదు దినములు నడచి యాఱవ దినమున మధువనముఁ జొచ్చియందు మధువుఁ గ్రోలి చెట్లఁ జెల్లాచెదరుచేసి వసియించి యేడవ దినమున రామునిజేరి యానవా లొసంగెను.

శ్రీరాముఁడు ఉత్తరఫల్గునీనక్షత్రయుక్తమగు అష్టమినాఁడు బయలుదేఱి యేడుదినములు సముద్రతీరమున స్కంధావారమునమండి పుష్యశుద్ధప్రతిపత్తుమొదలు తదియవఱకు సేనలు నడపి సముద్రముఁ జేరి చవితినాఁడు విభీషణునకు శరణొసఁగి పంచమినాఁడు మొదలు నాలుగు దినములు ప్రాయోపవేశము గావించెను. సముద్రుఁడు వర మొసఁగ దశమినాఁడు సేతువును గట్ట నారంభించి త్రయోదశికిఁబూర్తి చేసి చతుర్దశినాఁడు సైన్యమును సువేలాద్రిఁజేర్చెను. పూర్ణిమమొదలు విదియవఱకు రాముఁడు సపరివారముగా సముద్రము దాఁటి దశమివఱకు నెనిమిది దినములు లంకావరోధము గావించెను. ఏకాదశినాఁడు శుక సారణులరాకయు ద్వాదశినాఁడు సైన్యసమీకరణము త్రయోదశిమొదలు అమావాస్యవఱకు మూఁడు దినములు సైన్యము లెక్కించుటజరుగ నుత్సాహము నందెను. మాఘశుద్ధ ప్రతిపత్తునాఁడు అంగద రాయ బారము, విదియ మొదలు అష్టమి వఱకు యుద్ధము, మాఘశుద్ధనవమి

నాఁటి రాత్రి ఇంద్రజిత్తు రామలక్ష్మణుల నాగపాశమున బంధించుటయు, దశమినాఁడు వాయువు శ్రీరామునిచెవిలో స్వరూపము జపించుటయు వెంటనే నాగపాశములు వదలుటయు, గరుడుని రాక, ఏకాదశీ ద్వాదశు లందు ధూమ్రాక్షవధ, త్రయోదశిని అకంపనవధ, మాఘశుద్ధచతుర్దశి మొదలు కృష్ణప్రతిపత్తువఱకు ప్రహస్తవధ, మఱిమూఁడు దినములు సంకులయుద్ధము, పంచమి మొదలు అష్టమివఱకు కుంభకర్ణునిమేలుకొలుపు, పిదప నాలు దినములలో కుంభకర్ణునివధ, అమావాస్యనాఁడు శోకమున యుద్ధవిరామము, ఫాల్గునశుద్ధ ప్రతిపత్తు మొదలు నాలుగుదినములు బిసతంతుఁడు మున్నగు రాక్షసులవధ, పంచమి మొదలు సప్తమివరకు అతికాయవధ, అష్టమి మొదలు ద్వాదశివరకు కుంభనికుంభులవధ, పిదప మూఁడు దినములలో మకరాక్షాదుల చావు, ఫాల్గునబహుళప్రతిప ద్వితీయలలో ఇంద్రజిత్తు విజృంభణము, తదియ మొదలు సప్తమివఱకు విషాదకారణమున యుద్ధవిరామము, త్రయోదశి నాఁ డింద్రజిద్వధ, చతుర్దశిని యుద్ధవిరామము, అమావాస్యనాఁడు రావణుఁడు యుద్ధమునకు బయలుదేఱుట, చైత్రశుద్ధప్రతిపత్తు మొదలు పంచమివఱకుఁ బెక్కురు రాక్షసులవధ, షష్ఠి మొద అష్టమివఱకు మహాపార్శ్వాది రాక్షస సంహారము, నవమినాఁడు లక్ష్మణశక్తిభేదనము రావణ పలాయనము, ఆంజనేయుఁడు ద్రోణాద్రిని దెచ్చుట, దశమినాఁడు రాముఁడొక్కసారి పెక్కురురాక్షసులఁ జంపుట, ఏకాదశినాఁ డింద్రుని పంపున యాతని దివ్యరథమునుదెచ్చి శ్రీరాముని కర్పించుట, శుక్ల ద్వాదశిమొదలు కృష్ణచతుర్దశివఱకు ఘోరాతిఘోరయుద్ధము జరుగుట. ఆనాఁడే రావణవధ శ్రీరామ విజయము సంభవించెను. మాఘశుద్ధ ద్వితీయ మొదలు చైత్రబహుళ చతుర్దశివరకు జరిగిన యుద్ధములో యుద్ధవిరామదినములు పదునైదు తీసివేయఁగా డెబ్బదిరెండు దినములు మహాయుద్ధము జరిగెను. వైశాఖశుద్ధ ప్రతిపత్తునాఁడు శ్రీరామచంద్రుఁడు సకల సురజేగీయమానుఁడయ్యెను. విదియనాఁడు శ్రీరాముఁడు విభీషణపట్టాభిషేకముఁ గావించెను. తదియనాఁడు సీతా పాతివ్రత్యశుద్ధి యయ్యెను. చవితినాఁడు సీతాసహితుఁడై రాముఁ డయోధ్యకుఁ బుష్పకవిమానమున బయలుదేఱెను. పంచమినాఁటికిఁ బదునాలుగుసంవత్సరములు నిండఁగా శ్రీరాముఁడు సపరివారుఁడై

భరద్వాజాశ్రమముఁ బ్రవేశించెను. షష్ఠినాఁడు నందిగ్రామమున భరతసమావేశము జరిగెను. సప్తమినాఁడు శ్రీరాముఁ డయోధ్యలోఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. రామున కపుడు నలువదిరెండు సంవత్సరములు సీతకు ముప్పదిమూఁడుసంవత్సరములు. సీత రావణునింట నున్నది పదునొకండు నెలల పదునాలుగు దినములు.

వత్సా! రాముఁ డయోధ్యఁ బాలించుచుండఁగా అగస్త్యమహర్షి విచ్చేసి యాతనిచే నశ్వమేధయాగము చేయించును. ఆ గుఱ్ఱము నీ యాశ్రమమునకు వచ్చును. దానివెంట వచ్చిన రామపరివారము నీ వయోధ్య కేగి శ్రీరాముని దర్శింతువు. నాఁటికి నీ కర్మపూర్తియై నీతపము ఫలించును. నీవు శ్రీరామసాయుజ్యమునంది మోక్షమందఁ గలవు."

## ఆరణ్యకతపఃఫలాగమము

ఈ విధముగా సెలవిచ్చిన లోమశమహర్షికి నేను సాష్టాంగనమస్కారము చేసి యాతని యాజ్ఞ గైకొని నాఁటినుండి శ్రీరామమంత్రజప భజన పరాయణుఁడనై యుంటిని. లోమశ మహర్షి వాక్రుచ్చినట్లే అశ్వము వెంబడి మీరు వచ్చితిరి. నాకును గర్మఫల సమాప్తి పరిపూర్ణము కానున్నది. నా తపఃఫలమును త్వరలోనే నేను గనం గందునుగదా" యని పలికి యారణ్యకమహర్షి యానందపరవశుఁ డయ్యెను.

శత్రుఘ్నుఁ డామహర్షికథ యంతయు విని మిక్కిలి యాశ్చర్య పడి యాతని నయోధ్యాపురికిఁ దగుపరివారముతోఁ బంపి తాను అశ్వము వెంట ముందునకుఁ బోయెను.

## రామదర్శనము: సాయుజ్యప్రాప్తి

అయోధ్యాపురము సమీపింపఁగనే ఆరణ్యకమహర్షి రథమును దిగి పాదచారియై సరయూనదీతీరమున యజ్ఞదీక్షితుఁడై యున్న శ్రీరామచంద్రుని సమీపించి యాతని రూపమును గనులారఁగాంచెను. తత్క్షణ మాతఁడు పులకితశరీరుఁడై జలజల మని యానంద బాష్పములు

రాలుచుండఁ, గన్నీలు మూఁతవడ, భక్తివశమున దేహమును మఱచి పోయెను. కరుణాసముద్రుఁడగు శ్రీరాముఁడు లేచి యాతని కెదురేఁగి, కౌఁగిలించుకొని చేతులు పట్టుకొని తీసికొని వచ్చి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి పాదములు కడిగి యా జలములు తలపైఁ జల్లుకొని, గంధపుష్పాదులచే ఆ మహర్షిని పూజించి, పాఁడియావు నొసంగి, మార్గ శ్రమము వోవున ట్లుచితోపచారము లొనర్చి "స్వామీ! నీ సందర్శనమున నా యిల్లు పవిత్ర మయ్యెను. నేను ధన్యుఁడ నైతిని. నేఁటితో నాయశ్వమేధ యాగముకూడఁ బూర్తి కానున్నది. మహదాగమనము సకలఫలప్రదముగదా!" యని యాతని ననేక విధముల సంప్రీతు నొనర్చెను.

అంత, ఆరణ్యకమహర్షి శ్రీరాముని పాదపద్మములపై సాష్టాంగ పడి "దేవ దేవా! పరమేశ్వరా! నీ నిర్వ్యాజకటాక్షవీక్షణమున నా జన్మము ధన్య మయ్యెను. నా తపస్సు పండెను. నేను తరించితిని. సంసార సాగరమును దరించితిని. పరంధామా! నీ సాయుజ్యప్రాప్తి నా కొసంగి రక్షింపుము. జననమరణదుఃఖ పరంపర నుండి నన్ను శాశ్వతముగా రక్షింపుము. ఈ సుదినమునకై యెదురు చూచుచుంటిని. పాంచభౌతిక మగు నా యీ పాడుదేహమును విడిచి పుచ్చి తత్క్షణమే నీలో నైక్యమై బ్రహ్మజ్ఞానసంపన్నులు, యోగీశ్వరేశ్వరులు, భక్తిసంపన్నులు, పొందు నపునరావృత్తి రహిత శాశ్వతబ్రహ్మలోకనివాససిద్ధి నందుదు" నని పలుకఁగనే యా మహర్షి బ్రహ్మకపాలము పగిల్లున బ్రద్దలై యందుండి యొకదివ్యతేజ మా శ్రీరామచంద్రునిం గలిసెను. దేవతలు పుష్పవర్షము గురిసిరి. కిన్నరకింపురుషులు గంధర్వులు "జయజయ! సాయుజ్యమోక్షము నందిన ఆరణ్యకా! జయ జయ" అను ధ్వను లొనర్చిరి. సెలయేఱు వచ్చిచొచ్చిన మహాసముద్రునివలె శ్రీరామ చంద్రుఁ డతిగంభీరప్రశాంతదివ్యతేజస్వియై మెఱసెను.*

---

* పద్మపురాణము, పాతాళఖండము.

# మహర్షుల చరిత్రలు

## ఉదంక మహర్షి

భృగువంశమున జనించిన మహర్షులలో ఉదంకమహర్షి యొకఁడు. ఈతఁడు బాల్యమునుండియు గౌతమమహర్షికడ శిష్యుఁడై గురుశుశ్రూషా తత్పరుఁడై యాతని సేవించుచుండెను. గౌతమునికడ శిష్యులుగఁ జేరిన యనేకులలో నీతఁ డొకఁడు. అందరికన్న మిన్నగా గురునింటి పనులు శ్రద్ధతోను, భక్తితోను, ఓరిమితోను నీతఁడు చేయుచుండెను. ఇటు లుండ ననేకసంవత్సరములు గడచుచుండెను. గౌతముఁడు విద్యా పరిపూర్తి యైనశిష్యులను గ్రమక్రమముగాఁ బిలుచుచు వారు వారు కోరినవరము లిచ్చి యాశీర్వదించి పంపుచుండెను. కాని, యెన్ని సంవత్సరము లైనను, ఉదంకునివలన సేవ కొనుటయే కాని యాతనిం బిలిచి యేమికావలయు నని యడుగుట కాని, విద్యాపరిపూర్తియైనది: ఇఁకఁ బోవచ్చునని కాని, యెన్నఁడును బలుకకుండెను. బాల్యమున శిష్యుఁడుగాఁ జేరిన యుదంకునకు గుర్వాశ్రమముననే కౌమార యౌవన ములు కడచి గురుశుశ్రూషలోనే వార్ధక్యము పైఁబడెను. ఐనను, నిత్య మాతఁడు అడవులలోని కేఁగి కట్టెలు కొట్టితెచ్చుట, గురుగృహిణి యగు అహల్యాసాధ్వికిఁ దలలోనినాలుకవలె నుండి సమస్తగృహకృత్య ములు నిర్వర్తించుచుండుట మానకుండెను.

ఆ దినములలోని గురుశిష్యసంబంధ మట్టిది. గురు సేవలో నిమ గ్నులై శిష్యులు దేహస్మృతి యెఱుఁగకుండెడివారు. ఉదంకుఁ డెన్నఁ డును తనవయస్సునుగుఱించి లెక్కించుకొనుట కాని, తనముఖ మెట్లున్న దని యద్దమును జూచుకొనుటకాని తా నిన్ని విద్యలు నేర్చినను గురు వింకను వీడ్కో లీయఁడే యని యాతురత కనఁబఱచుట కాని లేకుండెను. ఒకనాఁడు వనమున కేఁగి యెండుకట్టెలమోపు నెత్తిని బెట్టుకొని యింటికి వచ్చి క్రిందఁబడవేసెను. మోపు చాల పెద్ద దగుటచేతను, మిక్కిలి బరువగుటచేతను, అది క్రిందఁ బడునపుడు ఉదంకునిజుట్టు కొంత కట్టెలకుఁ బెనఁగొని మోపుతోపా టదియు నేలఁబడెను. ఎండు కట్టెలను

జిక్కుకొని యూడిపడిన తనతలవెంట్రుకలు తెల్లనికాంతుల నీనుచుఁ దన వార్ధక్యదశను జెప్పకచెప్పెను. వెంటనే యాతఁడు "అయ్యో! నా శిరోజము లప్పుడే తెల్లపడిపోయినవే! నా బాల్యకౌమారయౌవనదశ లన్నియు గురుశుశ్రూషలోఁ గడచిపోయినవే? నేను జేరినతరువాతఁ జేరిన శిష్యు లనేకులు విద్యాపరిపూర్తియై గుర్వాజ్ఞ వెడలిపోయిరే! నా కింక విద్యాపరిపూర్తి కాదా? గుర్వనుగ్రహమే కలుగదా! గురుని యాశీర్వచనము, గురుపత్నిప్రసాదము, గురు వలయు మిచ్చి వీడ్కొలు పుటయు నా కీజన్మమునఁ గలుగవా? నే నేమియు గురుద్రోహము చేయలేదే? అహల్యాసాధ్విని గన్నతల్లిగా భావించి యామెసేవ నెన్నఁడేమఱక చేయుచునే యుంటినే? కోటానఁ గోటులు శిష్యులు వచ్చి చదివి కృతార్థులై పోవుచుండ నేను శాశ్వతముగా నిట్లుండిపోవలసిన దేనా? నా జన్మ మంతయు వ్యర్థ మైనదా?" అని యెన్నోయూహలు కలుగ నొక్కసారిగఁ బెల్లుబికివచ్చిన దుఃఖము నాపుకొనలేక వెక్కివెక్కి యేడ్వఁదొడఁగెను.

దయాసముద్రుఁ డగు గౌతమ మహర్షి యిది యంతయు దివ్య దృష్టిని గ్రహించి తన కొమార్తెయుఁ జక్కని చుక్కయు నగు తరుణిని ఉదంకుని యశ్రువులు భూమిపైఁ బడనీయక దోసిటఁబట్టుమని పంపించెను. ఆమె పరుగున వచ్చి ఉదంకుని కన్నీరు దోసిటఁ బట్ట సలసల క్రాఁగునావేఁడికన్నీటిచే నామె చేతులు వేఁడెక్క భరింపలేక యామె నేల విడిచెను. నేలఁబడిన యామేర యంతయుఁ దుకతుక నుడికిపోయెను.

వెంటనే గౌతమమహర్షి యుదంకుని బిలిచి "వత్సా! నీ దుఃఖమునకుఁ గలకారణ మేమి? నిస్సంకోచముగాఁ జెప్పు" మని యడిగెను. ఉదంకుఁడు "మహాత్మా! కోటానఁగోటులగు మీ శిష్యులపై మీకుఁ గల దయలో నాపై సహస్రాంశమైనను లేకపోవుటకు నేఁ జేసినదోష మే మని దుఃఖించితిని. అంతకన్న నేమియు లేదు. క్షమించి రక్షింపుఁ" డని గురుని వేఁడుకొనెను.

గౌతముఁ డంత "వత్సా! నీ గురుభక్తికి నేను మిక్కిలి సంతసించితిని. శిష్యు లెల్లరకు నేను వీడుకోలిచ్చి నీ కీయకుండుటకుఁ

గారణము నిన్నుందతికంటె నధికునిఁ జేయుటకే యని గ్రహింపుము. ఆలస్యమైనదే వార్ధక్యము వచ్చినదే యని విచారింపకుము. శరీరము పరిణామపేశలమే కాని, వలసినపుడు యౌవన మీయఁగల శక్తిగల మాకడ నీ వందులకు దుఃఖింపఁ బనిలేదు. మఱి నీ శ్రద్ధకు మెచ్చితిని. నీ బుద్ధికి సంతసించితిని. నీ వృద్ధిని గోరెదను. ఇదిగో నీకు నిత్య యౌవన మొసంగితిని. నవయువతియు, శ్రద్ధావినయవివేకవతియు నగు నా ముద్దుకూతు నిచ్చెదను. పెండ్లాడి యౌవనసుఖము ననుభ వించి గృహస్థాశ్రమమును నిర్వహింపుము. చిరకాలగురుసేవాగ్ని సంతప్త మగు నీ శరీరమును భరింప మానవ కాంతలకు సాధ్యము కాదు. గురుసుత తోఁబుట్టువుతో సమానురాలు, దీని నెట్లు పెండ్లాడుదు నని సందేహింపకుము. ఈమెకు శరీరాంతరముఁ గల్పించెదను. అది జన్మాంతరసమానమే యగుట ధర్మదూష్యము కాదు. ఇది అధర్మము కాకుండునట్లును నీకు యౌవనము లభించునట్లును వరము లొసంగితిని" అని పలికెను.

గౌతమమహర్షి వరప్రసాదమున ఉదంకునకు నూతన యౌవనము, గౌతమునికూఁతునకు దివ్యసుందర నూత్నశరీరమును లభించెను. ఉదంకుఁడు గురునాజ్ఞ నౌదల ధరించి యాకన్యారత్నమును బెండ్లాడెను.

పిదప, ఉదంకుఁడు గౌతముని పాదములకు మ్రొక్కి "గురుదేవా! నన్నిన్నివిధముల ననుగ్రహించిన నీకు గురుదక్షిణ యొసంగఁ గుతూ హలపడుచున్నాను. నా యందు వాత్సల్య ముంచి యేదేని కోరి నా కా యవకాశము నొసంగఁ బ్రార్థించెదను. సర్వశక్తిసంపన్నులగు తమకు నే నీయఁగలది లేదు. ఐనను, మీ కరుణకు నిదర్శనముగా నా కొనతిం" దని ప్రార్థించెను. దానికి గౌతముఁడు "వత్సా! నీవు నా కేమియును గురుదక్షిణ నీయవలసిన పని లేదు. లోకమునందలి గురు లకు దక్షిణ కావలయును. నీవు సత్ప్రవర్తనమున నుత్తమగృహస్థ ధర్మమును పాలించుటే నాకిచ్చు గురుదక్షిణ" అని బదులుచెప్పెను. ఉదంకుఁ డూరకుండక అహల్యాసాధ్విపాదములకు నమస్కరించి యేదైన వస్తువుఁ గోరుకొమ్మనియు గురుదక్షిణకన్న గురుపత్నీదక్షిణ యధిక

మనియుఁ బలికెను. అహల్య "వత్సా! నీవు పైవాఁడవు గావు. ఏ దక్షిణయు వలదు. నీ గురువులు చెప్పిన చొప్పున నడచుకొను" మని పలికెను. ఉదంకుఁడు మఱిమఱి యామెను విడువక ప్రార్థింపఁగా నామె "వత్సా! మిత్రసహుఁ డను రాజుభార్య ధరించు కుండలములు నాకుఁ గొనితెమ్ము. అవి ధరింప నాకు ముచ్చటగ నున్నది. దాన నా ముచ్చటతీరును. నీకుఁ బెంపు కలుగును" అని పలికెను.

'ఇది యెంతపని?' యని యుదంకుఁడు బయలుదేఱి వెడలెను. పిదప నొకనాఁడు గౌతముఁ డుదంకునిం గానక యాతఁడే మయ్యె నని యహల్య నడిగెను. అంత నామె జరిగిన సంగతి నెఱింగించెను. "అయ్యో! మిత్రసహుఁ డనురాజు శాపకారణమున రాక్షసుఁడై చరించు చున్నాఁడు. మనుష్యమాంసమును దినుచున్నాఁడు. ఉదంకుఁ డీసంగతి యెఱుఁగఁడు. ఆ రాజుకడ కేఁగుచో నేమి కీడు వాటిల్లునో కదా!" యని గౌతముఁ డనెను.

ఈ మాటలు విని యహల్య భీతచిత్తయై "నా కా సంగతి తెలి యదు. ఏదైనఁ గోరక తప్ప దని నన్ను మఱిమఱి బలవంత పెట్టు టచేఁ బంపితిని. కన్నతల్లి కన్న మిన్నగా నన్నుఁ బూజించు నుదం కున కే యుపాయమును బాటిల్లకుండునట్లనుగ్రహింపు" మని భర్తను బ్రార్థించెను. అంత గౌతముఁ డావరాయత్తచిత్తుఁడై యుదంకున కేప్రమాదమును కలుగకుండునట్లును, ఆతఁడు పోయిన కార్యము సిద్ధించునట్లును, ఆతని కణిమాదు లగు అష్టసిద్ధులు కలుగునట్లును, మనమున దృఢముగఁ దలపోసెను.

ఉదంకుఁ డట్లు పోయిపోయి యొక వనమున నొకగొప్ప వృషభము నెక్కి వచ్చుచున్న యొక మహాపురుషునిం గాంచి యాతఁ డొసంగిన వృషభ గోమయమును దిని యాతని యనుగ్రహ మంది ముందునకుఁ బయనమై పోయి మనుష్యరక్తసిక్తమగుశరీరము, కోరమీసములు, మిడిగ్రుడ్లు, భయంకరాకారము గలిగి యా శూన్యాటవిఁ దిరుగు మిత్ర సహుఁ డనురాజును గాంచెను. అతఁడు "రా. రా. ఆఁకలి యగు చున్నది. మనుష్యమాంస మెట్లు దొరకునా యనుకొనుచుండ వచ్చితివి.

రా. రా." యని పలికెను. ఆ మాటల కదరక బెదరక యుదంకుఁడు "రాజా! నేను గురుకార్యమున వచ్చితిని. అందుచేత నీవు నన్నుఁ జంప వీలుకాదు. నీకు నా రక్తమాంసములే కావలసినచో నా గురుని కార్యము నెఱవేర్చిన పిదపఁ దిరిగి నీ కడకు వచ్చెదను. అపుడు నీవు నా రక్తమాంసములు గైకొనవచ్చు" ననెను. "ఓయీ! పగలు మూఁడవ జాము దాఁటినతరువాత నా భోజనకాల మని దేవతలు నా కాజ్ఞాపించిరి. నీవు సరియైన యీ కాలమున వచ్చితివి కావున, నిన్నుఁ జంపి తినక విడువ" నని రాక్షసరూపమున నున్న రాజు పలికెను. "రాజా! నా మాట వినుము. నే నసత్య మాడను. నా పనియైన పిదపఁ దిరిగి వచ్చెదను. నీవు కోరికలఁ దీర్చెడి రాజ వని విని నా కోరినకోరిక నీవే తీర్పఁగల వని నేను వెదకి వెదకి నిన్నుఁ గనఁ గంటిని. నా కోరిక నాకై కాదు; గురువులకొఱకు. కావున, ముందు నీవు నా కోరికఁ దీర్చి తరువాత నీ యిష్టమైనట్లు చేసికొ"మ్మని ప్రార్థించెను. "అగుచో నీ కోరికయే?" మని రా జడిగెను. "నీ భార్య మదయంతీదేవి ధరించు కుండలములు నా కీయవలయు" నని యుదంకుఁ డర్థించెను. "ఏమిది? ఒరుల ధనము లిచ్చువా రెటనైనఁ గలరా? నీకుఁ గావలసిన నింకొక టేదైనఁ గోరుకొమ్ము ఇచ్చెద" నని రాజు పలికెను. ఉదంకుఁ డందుల కంగీకరింపక "నా కింకేమియు వలదు. నా కా కుండలములే కావలయు" నని పట్టుపట్టెను. "సరే నీవు పోయి నే నిమ్మంటి నని చెప్పి యామె నడిగి తెచ్చుకొను" మని రాజు తనభార్య యున్న ప్రదేశముం జూపెను.

ఉదంకుఁ డటు వెడలి యెంత వెదకినను ఆ దేవి కన రాదాయెను. విసివి యాతఁడు తిరిగి రాజుకడ కేతెంచి దేవి యెందునుగాన రాలే దని చెప్పెను. "అయ్యా! నా దేవి పతివ్రత, పవిత్ర. ఆమె యశుచులకుఁ గానరాదు. నీవు త్రిభువనపావనుఁడవు. నీ వశుచి వని యెట్లందును?" అని రాజు పలుక నుదంకుఁడు వృషభగోమయభక్షణంబున నశుచిత్వము తనకు కలిగియుండవచ్చు నని భావించి తూర్పుగాఁ దిరిగి పాదములు కడుగుకొని మంత్రజపముచేసి యాచమించి రాజు ననుమతిఁగొని మరల దేవికడ కాతఁడేగెను, ఈసారి యా మహాపతివ్రత కానన య్యెను.

ఉదంకుఁ డామెకు నమస్కరించి తనవచ్చినపని రాజానుమతి రెండును దెలిపెను. రాజుకడనుండి యానవాలు తీసికొని వచ్చినఁ డనకుండ లము లిచ్చెద నని యామె పలికెను. ఉదంకుఁడు మరల రాజుకడకు వచ్చి యామె పలుకులు తెలిపెను. "దీనివలన మేలుకలుగు నన రాదు; అది కాదన్న వేఱుమార్గము లేదు" అనుపలుకులు పలికి యానవాలుగాఁ దనభార్యకడఁ బలుకు మని రా జాయుదంకునకుఁ జెప్పెను. ఉదంకుఁడు తిరిగి దేవి కడ కేగి రాజు పలికిన పలుకులు తు చ తప్పకుండునట్లు పలికెను. ఆ మాటలు విని మదయంతి సంతోషించి "ఋషివర్యా! దేవతలు, గంధర్వులు, నాగులు ఈ కుండలములకోసమై వివిధోపాయ ములు పన్ని తస్కరింపఁ దలఁచుచుందురు. ఎంగిలి సోఁకినను, ఏమఱు పాటున నీవు నిద్రించినను, నేలమీఁద వీనిని బెట్టినను వారు వీనిని తస్కరింతురు. వీనిని భక్తితోఁ బూజించి ధరించినవారికి ఆఁకలిదప్పు లుండవు; అగ్ని భయము కలుగదు. విషవికారము సోఁకదు. భూత భేతాళబాధలంటవు. పిన్నలైనఁ బెద్దలైన వీనిని ధరింప నివి ధరించు వారి వయసును ననుసరించి చిన్నవి పెద్దవి యగుచుండును. వలసి నపుడెల్ల బంగార మివి కురియుచుండును. కావున వీనినిఁ బదిలముగాఁ దీసికొనివెళ్ళి మహాసాధ్వి యగునహల్యకిమ్ము. గురుకార్యమును నిర్వర్తిం పుము. నీకును మాకును మేలగు" నని భక్తిప్రీతి వినయంబులు ముప్పిరిగొన ఆ మహాదానముఁ జేసి నమస్కరించెను. ఉదంకుఁడపరి మితానందమంది యాదేవికి హృదయపూర్వకాశీర్వచనముల నొసంగి యా కుండలముల గ్రహించి రాజుకడ కేతెంచి "రాజా! నీవలనఁ గృతార్థుఁడ నైతిని. నీకు సకలభద్రము లగుఁగాక! నా కానవాలుగా నీవు చెప్పినవాక్య మతినిగూఢముగ నున్నది. దాని తాత్పర్యమును దెలిపిన సంతసించెద" నని పలికెను.

అందుల కా రా జిట్లు తెలిపెను. "ఋషివర్యా! రాజులు బ్రాహ్మ ణులఁ బూజింతురు. నేనును విప్రులఁ బూజించుచునే యుండెడి వాఁడను. నాకీ శాపము బ్రాహ్మణునివలననే కలిగెను. ఈ శాపపరిహార మునకై విప్రసేవ తప్ప వేఱుగతిలేదు. బ్రాహ్మణసేవదుస్తరము, అసిధారా వ్రతమువంటిది. "దానివలన మేలుకందు మనరాదు, అది

కాదన్న వేఱుమార్గములేదు" అనుగుర్తు దేవికి నీతోఁ జెప్పి పంపితిని. అనఁగా నీ కుండలములు మహర్షికి దానము చేసినచో దానివలన మనకు మేలగునని నా తలంపామెకుఁ దెలియ జేసితిని. ఆమె పతివ్రత, ఉత్తమురాలు కావున నా భావ మెఱిఁగి నిరుపమాన మగురత్నకుండల దానమును ఉత్తమోత్తమ బ్రాహ్మణుఁడ వగు నీకు వెంటనే చేసినది." ఆ మాటలు పలుకుచుండు రాజునకు ఉదంకమహర్షి పుణ్యసాన్నిధ్యమున నొక మహాపుణ్యము సోఁకి శాంతవచనములు, కుండలదానశ్రద్ధ, నూతనసత్త్వ సంపద లభించెను. ఉదంకుఁ డతనికడ సెలవుగైకొని గురుపత్ని కా కుండలము లిచ్చి తిరిగి వచ్చెద ననియు నప్పుడు తన్ను భక్షింపవచ్చు ననియుఁ బలికెను. రా జాతనింజూచి "మహనీయ తపోనిధీ! నీ పెంపు నాకుఁ గానవచ్చినది. చంపెడువానికడకు మగిడి వచ్చెడివారు గలరా? నీవు దయయుంచి నీ తపశ్శక్తిచే నా యార్తింబాపి కాపాడవే" యని ప్రార్థించెను.

అపారకరుణ మెఱయు నుదంకుఁడు రాజుం జూచి "రాజా! ఏ కారణముచేతనైనను మహాత్ములకుఁ గోపము వచ్చినను అది వెంటనే యుపశమించును. నీ దోషమువలన నీ కీ కీడు వచ్చినది. నేను నీకడకు వచ్చుటయు, నీవు నా కోరిక తీర్చుటయు నివి యన్నియు నా గురువరు లగు గౌతమమునీంద్రుని చల్లనిచూపు వల్లనేయైయుండు నను కొందును. వారి దయగలిగిన నీకును నాకును సకలలోకములకును మేలు కలుగు" నని పలికి తన కరకమలమున నా రాజు మేను నిమిరెను. వెంటనే రాజు రాక్షసత్వమును విడిచి శుద్ధసత్త్వుఁడై భక్తివినయ భరితుఁడై యాతనిం బ్రస్తుతించి నమస్కరించెను.

పిదప, మిత్త్రసహుఁ డాదరమేదురముగా "మహాత్మా! నీ వతిథివి. నా యింటఁ గుడిచి నన్ను ధన్యునిఁజేసి మఱి పొమ్ము" అని ప్రార్థించెను. ఉదంకుఁ డందుల కంగీకరించెను. భోజనసమయమున అన్నములో తల వెండ్రుకలు వచ్చెను. ఉదంకుఁ "డయ్యో! నీ కింకను బాపక్షయము పూర్తిగాఁ గాలేదు. ఐనచో నిట్టిదోషము నీకుఁ బట్టియుండెడిది కాదు. అపరీక్షిత మైనయన్నముఁ బెట్టితివి. కావున, నీ వంధుఁడ

వగుదు'' వని శపించెను. ''అల్పదోషమున నీవు నన్ను శపించితివి. నీ వనపత్యుఁడ వగుదు'' వని రా జాతనికిఁ బ్రతిశాపమిచ్చెను. వెంటనే యుదంకుఁడు "రాజా! నా శాప ముపసంహరించెదను. నే ననపత్యుం డనుగా నోపను. నీ శాపము నుపసంహరింపు'' మని కోరెను. అందుపై రాజు ''ఋషీశ్వరా!

నిండు మనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత! విప్రులయందు నిక్కమీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్.

(భార. ఆది ౧. ౧౦.౧)

కావున శాపముఁ ద్రిప్పఁగలశక్తి లేని నన్ను మన్నించి శక్తియుతుఁడవు గావున నీ శాపమునుండి నన్ను రక్షింపు" మని ప్రార్థించెను. ఉదంకుఁ డందుల కియ్యకొని రాజునకు శాపమోక్షము ననుగ్రహించి వెడలిపోయెను.

ఉదంకుఁడు కుండలముఁలు కృష్ణాజినమున జాగ్రత్తగా దాఁచి గౌతమాశ్రమ మార్గమున వేగముగాఁ బోవుచుండెను దారిలోఁ బరిపక్వ ఫలములతోఁ గూడిన బిల్వవృక్ష మొకటి కానిపింప నాఁకలిబాధ పోఁగొట్టుకొనఁ దలంచి ఉదంకుఁ డా వృక్షమునెక్కి కృష్ణాజినము నొక కొమ్మకుఁ దగిలించి ఫలములు గోసికొనుచుండెను. ఇంతలో నొక పెద్ద గాలి వీవ, కృష్ణాజినము పట్టుదప్పి నేలపైఁ బడెను. వెంటనే తక్షకుఁడను పాములరాజు కుండలము లపహరించి నాగలోకమునకు భూ వివరమార్గమునఁ బోయెను. ఉదంకుఁ డది చూచి యొక్క పెట్టున భూమి కుటికి ఆ పామును బట్టఁబోయి యొకపుట్టఁ ద్రవ్వ మొదలిడెను. ఆ మహనీయుఁ డట్లు తన్నుఁ ద్రవ్వుట భరింపఁజాలక భూదేవి భయపడెను. బ్రాహ్మణరూపమున నింద్రుఁ డచటికివచ్చి ''అయ్యా! కొయ్యకోలతోఁ ద్రవ్వినచోఁ బాతాళమునకు మార్గ మేర్పడునా? ఎవ్వరైన నవ్వి పోదురు. పాతాళలోక మిక్కడకు వేయియోజనముల లోఁతున నున్నది. నీ కుండలము లపుడే పాతాళమును జేరిన'' వని పలికెను. ఉదంకుఁ

డాతనితో "అయ్యా! ఏమైనఁ గానిమ్ము. పాతాళమైన గితాళమైనను, నే నేఁగి నా కుండలములు తెచ్చుకొని తీరెదను. లేదా ఆ ప్రయత్న మునఁ బ్రాణములైన వీడెదను. అంతేకాని నా ప్రయత్నము విర మింప" నని శపథముచేసెను. ఆ పలుకులు విని యింద్రుఁ డాతని దృఢనిష్ఠ కలరి నిజరూపముం జూపి యాతఁడు త్రవ్వ కొయ్యగోలకే వజ్రాయుధమునకుఁ గలుగు వాఁడిమియు శక్తియునిచ్చి కృతకృత్యుఁడ వగు మని యుదంకు నాశీర్వదించి వెడలిపోయెను.

ద్విగుణితనిష్ఠతో నుదంకుఁడు భూమిని ద్రవ్వుచుండఁగా భూదేవి భయపడిపోయి ఉదంకునకుఁ బాతాళలోకమునకుఁ దెరు విచ్చెను. ఉదంకుఁడు పాతాళలోకమున కేగి యనేకవిధములగు ప్రాకారములచే నిండి, అనేకవిధముల రత్నముల కాంతులచే మిఱుమిట్లు గొలుపుచున్న యా లోక మాలోకించి పది యోజనముల వెడల్పు పంచ యోజనముల విస్తారము నగు పాతాళద్వారమును గని యుదంకుఁడు తన కెట్లు కుండలాహరణము సాధ్య మగునో యని తెల్లఁబోయి చేయునదిలేక నాగపతుల నిట్లని స్తుతించెను.

"బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడిన్.
అరిది తపోవిభూతి నమరారులబాధలు పొందకుండఁగా
నురగుల నెల్లఁ గాచిన మహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయినవాసుకి మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్.
దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్ విపులప్రతాప సం
భావితశక్తిశౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర
త్పావకతాపితాఖిలవిపక్షులు నైనమహానుభావు లై
రావతకోటిఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్ను లయ్యెడున్.

గోత్రమహామహీధరనికుంజములన్ విపినంబులం గురు
క్షేత్రమునం బ్రకామగతిఖేలన నొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించుబలదర్పపరాక్రమదక్షుఁ దీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁబ్రసన్నుఁడయ్యెడున్.”

భార. అది. ౧, ౧౦౫, ౧౦౬, ౧౦౭, ౧౦౮

పిదప, ఉదంకుఁ డందు తెలుపు నలుపు దారములతో వస్త్రమును నేయుచున్నట్టి స్త్రీలను, ద్వాదశారచక్రముఁ ద్రిప్పుచున్న కుమారు లార్వురను, పెద్దగుఱ్ఱము నెక్కి మహాతేజస్వి యైన యొక దివ్య పురుషునిం జూచి యర్థవంతములైన వేదస్తుతులతో వారి నెల్లరిని సంతోషపెట్టెను. ఆ దివ్యపురుషుఁడు ఉదంకునిజూచి “వత్సా! నీ కేమి కావలయునో కోరుకొ” మ్మనెను. దాని కాతఁడు “దేవా! ఈ నాగు లందఱు నాకు వశులు గావలయు” నని కోరెను. “అగుచో నీవు వచ్చి నా గుఱ్ఱము చెవిలో నూఁదు” మని ప్రేరేచెను. ఉదంకుఁ డట్లొనరింపఁ గనే ఆ గుఱ్ఱము ప్రతిరోమకూపమునుండి యనేకములగు మంటలు బయలు దేఱి పాతాళలోక మంతయు భయంకరముగా వ్యాపించెను. నాగకుల మంతయు మిక్కిలి భయపడెను. ప్రళయకాలవహ్నివలె వ్యాపించిన యగ్నిహోత్రములఁజూడ పాఁపరాజు గడగడలాడిపోయెను. ఇది యంతయు ఉదంకుని భయంకరకోపాగ్నియని తలపోసి యాతనిని శరణువేఁడుటకన్న గత్యంతరము లేదని కుండలములు తీసికొనివచ్చి యాతని కర్పించి తక్షకుఁడు తన్నుఁ గాపాడు మని శరణుచొచ్చెను.

ఈ విధముగాఁ గుండలములు తిరిగి గ్రహించియు ఉదంకుఁ డిట్లు తలపోసెను. “నేఁటినుండి నాల్గవదినమునకుఁ గుండలములు తీసికొనిరమ్ము. నేను వ్రతముఁ బూర్తిచేసికొని సిద్ధముగానుందు” నని గురుపత్ని పంపినది. అయ్యో! నేఁడే నాల్గవదినము. నే నెట్లి పాతాళము నుండి బయటపడఁగలను? ఎట్లు గౌతమాశ్రమము చేరఁ గలను? అంతయు నగమ్యగోచరముగా నున్నదే! నేఁడుపోయి కుండలము లహల్యాసాధ్వి కీయునినాఁడు నాశ్రమ మంతయు వ్యర్థమే యగునే!” అని చింతించు నుదంకుని యభిప్రాయ మెఱిఁగి యా దివ్య

పురుషుఁడు తన గుఱ్ఱమునిచ్చి దానిపై నెక్కి మఱుక్షణములో గౌతము నింట దిగఁగల వని చెప్పెను. ఉదంకుఁ డమితానంద మంది కృత జ్ఞుఁడై గుఱ్ఱమునెక్కి తలఁచిన యా క్షణముననే గౌతము నింటికి వచ్చి చేరెను.

అట గురుపత్నియగు నహల్యయు శుచిస్నాతయై నూతన వస్త్రముల ధరించి కుండలములు ధరించు సమయ మగుట నెదురుచూచు చుండెను. ఉదంకుఁడువచ్చి కుండలము లామె కర్పింపఁగనే యామె వానిని ధరించి పతికి నమస్కరించి బ్రాహ్మణులఁబూజించి తాను దల పెట్టిన వ్రతము పూర్తికావించెను.

గౌతముఁ డుదంకునిఁ గౌఁగిలించుకొని "వత్సా!

నీ చరితంబు చిత్రమహనీయము మిత్రసహక్షితీశ్వరున్
నీచతఁ బాప నాగ మపనీతము సేసినకుండలద్వయం
బా చతురత్వ మా బలిమి యా దృఢనిశ్చయ మట్టులొప్ప ధ
ర్మోచితశీలఁ దేర నొరుఁ డోపునె యేను నిజంబ పల్కితిన్."

అని ప్రస్తుతించెను. ఉదంకుఁడు గురుపాదములకు మ్రొక్కి తాను గౌతమాశ్రమమునుండి బయలుదేఱి వెడలినది మొదలు కుండలములు తెచ్చునందాఁక జరగిన యావద్విషయమును బూసగ్రుచ్చినట్లు గురువు లకు నివేదించి "దేవా! ఆ దివ్యపురుషుఁ డెవఁడు? ఎద్దేమిటి? గోమయ మేమి? తెలుపు నలుపు నూలునేయు స్త్రీలెవ్వరు? ఆ యాఱుగురు కుమారు లెవ్వరు? నాకు సాయపడిన యా దివ్యుఁ డెవ్వఁడు? ఇవి యన్నియు దివ్యజ్ఞానసంపన్నుల రగు తామే నాకుఁ దేటతెల్లముగాఁ దెలుపుఁ" డని ప్రార్థించెను.

గౌతమమహర్షి యుదంకుని కిట్లు తెలిపెను. "వత్సా! ఆ దివ్య పురుషుఁ డింద్రుఁడు. ఆ యెద్దు ఐరావతము. గోమయ మమృతము. నాగలోకములోఁ గానవచ్చిన స్త్రీ లిద్దఱు ధాత, విధాత. వారు నేయు వస్త్రము అహోరాత్రము. ద్వాదశారములు గలచక్రము పండ్రెండు మాసములతోఁ గూడిన సంవత్సరము. ఆఱుగురు కుమారులు ఆఱు

ఋతువులు. ఆ గుఱ్ఱము అగ్ని. ఆ పురుషు డింద్రసఖుఁ డగుపర్జన్యు
తొలుతనే యింద్రునిఁ గాంచి యమృతముఁ దిన్నవాఁడ వగుట
కీ పను లన్నియు అవలీలగా జరిగినవి. నీ వలన మా కానందమైన
గురుఋణము ని ట్లద్భుతముగా నీవు తీర్పఁ గంటివి. నీవు నీ యిష్ట
వచ్చిన ట్లుండుము.

"కర మిష్టము సేసితి మా
కరిసూదన! దీన నీకు నగు సత్ఫలముల్
గురుకార్యనిరతు లగు స
త్పురుషుల కగు టరుదె! యధికపుణ్యఫలంబుల్."

భార. అది. ౧. ౧

ఉదంకుఁడు నమితానందమున గురుని వీడ్కొని గురుపత్ని సె
గైకొని భార్యాసహితుఁడై యేఁగి స్వీయాశ్రమమును నిర్మించుక
యటఁ దపోగృహస్థజీవన మారంభించెను. *

తక్షకుఁడు తన కకారణముగ నొనర్చిన యపకారము నుదంకు
మఱవక దానికిఁ బ్రతీకారము చేయఁ దలఁచి జనమేజయునిపాలి కే
"మహారాజా! తొల్లి నే గురుకార్యముఁ జేయఁ బూని వెళ్లఁగా
కుటిలస్వభావుఁడు, వివేక విహీనుఁడు నగు తక్షకుఁ డకారణముగా నన
బాధించెను. మఱియు, నీ తండ్రి యగు పరీక్షిత్తు చనిపోవుట కా దు
ర్గుఁడే కారణము. కావున, నీవు సర్పయాగము చేసి యా దుర్మా
కాక యా దుర్మార్గవంశము నంతను నశింపఁజేసి పుణ్యము గట్టుకొన
మని హెచ్చరించెను.

జనమేజయుఁడును గోపోద్దీపితుఁడై బ్రాహ్మణులఁ బిలిపించి త
సర్పయాగము చేసెదనని ఋత్విజులఁ బిలిపించి కావలసిన యేర్పా
లన్నియుఁ గావించెను. యాగ మారంభమై హోమము జర
చుండఁగా సర్పరాజు లందఱు వచ్చి యందుఁ బడి చచ్చుచుం
తక్షకుఁ డతిభీతుఁడై యింద్రునిఁ బ్రార్థించెను. తుదకు ఆస్తీకుఁ
మహర్షి జనమేజయుని ప్రార్థించి నివారించుటచే యాగ మాగిపోయె

* భారతము; ఆదిపర్వము; అశ్వమేధపర్వము.

## ఉదంకునకు మహాశివుఁడు ప్రత్యక్షమగుట

తరువాత ఉదంకుఁ డొకమరుభూమిని జేరి యందనేక సంవత్సరములు మహాశివుని గుఱించి మహాతప మొనరించెను. చిరకాలమునకు దయకలిగి శివుఁ డుదంకునకుఁ బ్రత్యక్షమయ్యెను. ఉదంకుఁ డా మహాదేవునకుఁ బ్రదక్షిణసాష్టాంగనమస్కారము లొనరించి యిట్లని స్తుతించెను:

"దేవదేవ! శ్రుతిప్రమాణవిధేయ! మాధవ! జంగమ
స్థావరాత్మక మైనలోకము సర్వమున్ భవదీయ మా
యావిధేయము విశ్వరూపుఁడ వవ్యయుండవు నీవ స
ద్భావసుస్థితి నిన్నెఱింగినఁ బాయుఁ బాపము లచ్యుతా!

అనిమిషసిద్ధసంయమివిహంగభుజంగముఖ్యు లెల్ల ని
న్ననిశముఁ గొల్చి నీదయఁ గృతార్థతఁ బొందుదు రెందు నీవు నె
మ్మనమున సంతసిల్లుడు సమస్తజగంబులు శాంతిఁ బొందు నీ
కినుకకు మాఱు లేదు శివకీర్తన! యీ భువనత్రయుంబునన్.

విక్రమత్రయలీల నోలిన విష్టపత్రితయంబుఁ బె
ల్లాక్రమించితి క్రూరు లైనసురారివీరులఁ బ్రస్ఫుర
చ్చక్రవిక్రమకేళిఁ ద్రుంచితి సర్వయజ్ఞఫలావహా
ప్రక్రియాత్ముఁడ వీవు నిశ్చలభావభవ్య జనార్దనా!"

భార. అర. ౧. ౨౭౬, ౨౭౭, ౨౭౮.

అని పరిపరివిధములఁ జేసినయుదంకుని ప్రస్తుతి కలరి మహేశుఁడు "వత్సా! నీ కేమి కావలయునో కోరుకొను మనుగ్రహించెద" నని దయామయుఁడై వీనులవిందుగాఁ బలికెను. "దేవాదిదేవా! నీ దివ్యరూపము నిట్లు ప్రత్యక్షముగాఁ గనఁగల్గితిని. ఇంతకంటె నాకుఁ గావలసిన వరమే లేదు. ఐనను నా మనస్సు సత్యధర్మశమములయందు స్థిరముగా నుండునట్లు నాకు నీపై భక్తి స్థిరముగ నిలుచున ట్లనుగ్రహింపు" మని యుదంకుఁడు ప్రార్థించెను. శివుఁ డట్లే యని యాతని కోరినవర మనుగ్రహించి లోకహితార్థము సత్కృతు లొనర్పు మని దీవించి యంతర్హితుఁడయ్యెను.



## ఉదంకుఁడు కువలాశ్వు ననుగ్రహించుట

తొల్లి యిక్ష్వాకువంశజుఁ డగు బృహదశ్వుఁ డనుమహారాజు కువలాశ్వుఁ డనుసత్పుత్త్రునిం గాంచెను. సంతానవంతుఁడును, సమర్థుఁడును, సర్వధర్మరతుఁడును నగుకుమారునికిఁ బట్టాభిషేకము చేసి రాజ్య మాతని కొప్పగించి బృహదశ్వుండు వనమునకుఁ బోయి తపస్సుచేసికొన నిశ్చయించుకొనెను. ఆ సమయమున ఉదంకమహర్షి యచటికి విచ్చేసి బృహదశ్వునిచే సత్కృతు లంది యాతని కిట్లు బోధించెను. "రాజా! నీవు ప్రజారక్షణము చేయుటే ధర్మము. అది మాని యడవికిఁ బోవలదు. రాజులకుఁ బ్రజాపరిపాలనము చేయుటకంటె నధికవ్రతము లేదు. ప్రాచీనరాజు లందఱును ధర్మపాలనముననే కీర్తి గాంచిరి. నీ వంటి మహారాజు బాహుబలమున నేల యేలుచుండుటచేతనే నా వంటి మునులు తపముచేసికొనుచు ధర్మకర్మము లాచరించుట సాధ్యమైనది.

మఱియు నొక విచిత్రవిషయముఁ జెప్పెదను. మధుకైటభు లని పేరువడ్డ రాక్షసులకుఁ గుమారుఁడై పుట్టిన ధుంధుఁడనువాఁడు బ్రహ్మదేవునిఁ దపమున మెప్పించి వరములు వడసి దేవదానవులకు గంధర్వులకు జయింపరానివాఁడై మదించి యున్నాఁడు. అతఁ డిపుడు మా యాశ్రమసమీప ప్రదేశమున సముద్రమునందలి యిసుక తిప్పలోఁ బెద్దబిలము గావించుకొని యందుసుఖముగా నిద్రించు చున్నాఁడు. వాఁడు విడిచిన నిశ్వాసపు గాలి సంవత్సరమున కొకమాఱు పైకి వచ్చి పెద్దగాలిదుమారముఁ గల్పించును. దానివేగమున నచ్చటి భూమి, శిలలు, వృక్షములు ఏడు దినములదాఁక కంపించుచునే యుండును. వానిమూలమున మాకును మా యాశ్రమవాసులకును జాల భయముగ నున్నది. నీవు వానిని జంపి మాకును లోకమునకును మే లొనగూర్పుము. ఇంకొకరహస్యము. ఈ దుర్మార్గునిఁ జంపఁదలఁచిన వానికిఁ దాను సంపూర్ణసహాయుఁడ నగుదు నని పరమశివుఁడు నాకుఁ జెప్పియున్నాఁడు. నీవు తక్క ఈ పని యింకొకరు చేయలేరు. కావున, నీ వట్లొనర్చి లోకసంరక్షణ మొనర్పు" మని కోరెను. "ఋషీంద్రా! నేను అస్త్రసన్న్యాసము చేసి వనమునకేఁగ దృఢనిశ్చయుఁడనైతిని. నన్ను మన్నింపుము. నీవు కోరినపని నా తనయుఁ డగు కువలాశ్వుఁ

దొనరింపఁ గలఁడు. కాన, దయతో నా కనుజ్ఞ నిమ్మని కోరి బృహదశ్వుఁ డడవికిఁ బోయెను.

తండ్రియాజ్ఞ ననుసరించి యుదంకమహర్షి కోరికఁదీర్ప నభిలషించి కువలాశ్వుఁ డుదంకునిఁ గూడ నిడుకొని ధుంధుని నెదిరించి ప్రచండయుద్ధమున నాతని నోడించెను. కువలాశ్వుఁడు బ్రహ్మాస్త్రముఁ బ్రయోగింప నది ధుంధుని గాల్చి బూడిదచేసి విడిచెను. ఇంద్రాదులు విచ్చేసి ధుంధుమారుఁ డని కువలాశ్వుఁ బ్రశంసించి యుదంకునికి నమస్కరించి వెడలిరి. ఉదంకుఁడు సంతోషించి కువలాశ్వు నాశీర్వదించి నిజాశ్రమమున కేగెను. *

## శ్రీకృష్ణుఁడు ఉదంకాశ్రమమునకు వచ్చుట

శ్రీకృష్ణుఁ డొకప్పుడు హస్తినాపురమునుండి ద్వారకానగరమున కేఁగుచు మార్గమధ్యమునఁ గల ఉదంకమహర్షి యాశ్రమమునకు విచ్చేసెను. ఉదంకుఁడు బ్రహ్మానందమున నాతని నెదుర్కొని షోడశోపచారములతో నతిథిసత్కారము లొనరించి యధికభక్తిఁ జూపెను.

ఆ పిమ్మట అన్నియు నెఱిఁగియు నేమియు నెఱుఁగనట్లు ఉదంకుఁడు "కృష్ణా! కౌరవపాండవులకు బంధుభావము నెలకొల్పి రాజు లందఱును సుఖముగా నుండునట్లు చేసితివికదా? కౌరవులన్నను బాండవులన్నను నీ కేమాత్రము భేదము లేదు. నీవు నిష్పక్షపాతబుద్ధివి" అని యెత్తిపొడిచెను. శ్రీకృష్ణుఁడు నన్నియు నెఱిఁగియు నేమియు నెఱుఁగనివానివలె "ఋషీంద్రా! నేను కురురాజుతో నెంతయో యుచితముగా మాటాడితిని. బెదరించితిని. నయమునఁ జెప్పితిని. భయమునఁ జెప్పితిని. భీష్మద్రోణులును జెప్పిరి. బలవంతపెట్టిరి. ఐన నాతఁడు సంధి కంగీకరింపఁడయ్యె. అతిలోభులై వంశధర్మము విడిచి యే విధముగను సంధి కంగీకరింపక కౌరవులు పాండవులతోఁ బోరి సపుత్రమిత్రపరివారముగా స్వర్గమునకుఁ బోయిరి. పాండవు లైదుగురు మాత్రము మిగిలిరి. కాలనియతిం గడవ నెవ్వరికిని శక్యము కాదు గదా" యని పలికెను.

---

* భారతము: అరణ్యపర్వము.

## ఉదంకుఁడు శ్రీకృష్ణుని శపింపఁబూనుట.

ఆ మాటలకుఁ గోపించి యుదంకుఁడు "కృష్ణా! నీవు దొంగవు. నీవు నిజముగఁ దలఁచిన సంధి జరుగకపోయెడిదా! నీవు మిథ్యాచారుఁడవై శక్తి గలిగియు సంధి చేయక కౌరవకులమును సర్వనాశనము చేసితివి. ఈ దోష మంతయు నీదే. ఈ దోషమునకు నిన్ను శపించెదను జూచుకొ"మ్మని హుంకరించెను. "మునీంద్రా! నీవు నన్ను శపించిన శపింపవచ్చును గాని ముందు నామాటలు వినుము.

సత్త్వరజస్తమోగుణములు నా వశమునఁ బ్రవర్తించును. మరుత్తులు వసువులు మున్నగువా రెల్లరు నా యందే పుట్టిరి. నే నన్నింటి యందు నుందును. అన్నియు నా యం దుండును. అపర మన్నను పర మన్నను రెండు తత్త్వములు నేనే. ఓంకారముతోఁ గూడిన వేదములు నేనే. నాలుగు వర్ణములు నేనే. నాలు గాశ్రమములు, వానివాని సర్వకర్మజాలములు, స్వర్గమోక్షములు అన్నియు నా వశము అని యెఱుంగుము. క్రతుపరులు నన్నే సంస్తుతించి ఫలమును పొందుదురు. దోషులు నన్నుఁ గీర్తించి ప్రాయశ్చిత్తములు చేసికొని కృతార్థు లగుదురు. మనోధర్మములకు నేనే కర్తను. బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపము ధరించి సృష్టిస్థితిలయములు నేనే యొనరింతును. లోకసంరక్షణార్థమై అధర్మాత్ములఁ ద్రుంచి ధర్మముల నుద్ధరించెదను. ఐనను, అధర్మ లగు కౌరవులను ధర్మాత్ములగు పాండవులతోఁ గలుపుటకు శక్తివంచనలేక ప్రయత్నించితిని. దివ్యజ్ఞాన సంపన్ను లగువ్యాసాదిమహర్షుల కాసంగతి తెలియును. వారు నన్ను మెచ్చుకొనిరి. దురాత్ము లగుకౌరవులు మహాత్ములగు పాండవుల నెదుర్కొని ధర్మయుద్ధమున నశించిరి. ఇది నేఁ జేసినపని. ఇఁక నన్ను శపించిన శపింపుము. స్తుతించిన స్తుతింపుము అని కృష్ణుఁడుపలికెను.

ఉదంకమహర్షి యాతని పాదములకుఁ బ్రణమిల్లి లేచి "దేవా! తెచ్చిపెట్టుకొన్న యహంకారమున నీ వేమందువో యని యట్లులుక నటించితిఁ గాని సర్వమును నే నెఱుఁగుదునుగదా! అ యీ చనవుబలిమిని చేసిన యపరాధమును క్షమించి దయతో నీ విశ్వరూపము నొక్కసారి

చూపుము. దాన నా మనస్సు, చూపు, జన్మము ధన్యములు కాఁగా జన్మరాహిత్య మందెద" నని ప్రార్థించెను.

శ్రీకృష్ణుఁడు దయదలఁచి యర్జునునికిఁ జూపిన విశ్వరూపము ఉదంకునకుఁ జూపెను. వెంటనే ఉదంకుఁ డాశ్చర్యభయభక్తులతోఁ జేతులు మోడ్చి 'నమః పురుషోత్తమాయ తే' యని నిలిచి గద్గదస్వరముతో "దేవా! పుండరీకాక్షా! నీ పాదము లీ భూమియంతయు వ్యాపించినవి. నీ చేతు లాకసము నాక్రమించినవి. ఆకాశము నీ కడుపుతో నిండిపోయినది. దిశ లన్నియు నెచ్చటఁ జూచినను నీ చేతులతో నిండిపోయినవి. ఇన్నిచరణములు, ఇన్నితలలు, ఇన్నిహస్తములతో నన్నియు నీ వైతివి. ఈ నీ విశ్వరూపము నా కన్నులను మనస్సును దన్పినది. విశ్వరూపా! ఈ రూప ముపసంహరింపుము" అని కోరెను. "నీ కే వరము కావలయునో కోరుకొను" మని యా పరమేశ్వరుఁ డనెను. "నీ దివ్యరూపముఁ జూచితిని. జన్మము ధన్య మయ్యెను. ఇంక నా కేమియు వల" దని యుదంకుఁ డనెను. "అట్లు కాదు. నన్నుఁ గన్న వారికి శుభ మీయక పోను. ఏది కావలయునో వెంటనే కోరుకొను మిచ్చెద" నని యా దేవాదిదేవుఁ డత్యాదరముతోఁ బలికెను.

"అగుచో దేవా! లోకహితమే ఆత్మహితము. కానఁ గోరెద. ఇది మరుదేశము. ఇచట జల మెప్పుడును దుర్లభము. కావున, ఈ ప్రదేశమును జలయుక్తము చేయు" మని యుదంకుఁడు కోరెను. శ్రీకృష్ణుఁడు విశ్వరూప ముపసంహరించి "నన్నుఁ దలంచినపుడు నీకు జలములు లభించు" నని వర మిచ్చి యంతర్హితుఁ డయ్యెను.

ఒకనాఁ డుదంకుఁడు దప్పిగొని శ్రీకృష్ణుని స్మరించెను. వెంటనే యొకమాలవాఁడు బాణబాణాసనపాణియు, దిగంబరుఁడు, మలినాంగుఁడు నయి కుక్కలు తనచుట్టు చేరి రాఁగా, ఒడలెల్ల నీరు చిమ్ముచుండ నుదంకుని జేరి "అయ్యా! నీరు త్రావి దప్పి పోఁగొట్టుకొను" మనెను. వానిని "వలదు. పొమ్మని" యుదంకుఁ డదల్చెను. ఓయీ "నీ మీఁదిదయతో వచ్చితిని, త్రావు" మని మరల ననెను. ఉదంకుఁ డాతని నలుకతోఁ బో పొమ్మని కసరెను, వాఁడు కుక్కలతో నంతర్ధాన

మయ్యెను. ఇది యంతయు శ్రీకృష్ణమాయ యని యుదంకుఁడు తలపోయుచుండఁగాఁ గృష్ణుఁ డచటికి వచ్చెను. "అయ్యా! కృష్ణభగవానుఁడా! నీ విచ్చిన వరము వ్యర్థమైనది. మాలవాని యొడలి జలము నేను త్రాగుదునా? ఇదియా నీవు నాకుఁ జేసినమేలు?" అనెను. శ్రీకృష్ణుఁ "డయ్యా! నే నింద్రునిఁ బ్రార్థించి నీ కమృత మిమ్మంటిని. అతఁడు దేవా! మానవుల కమృత మేల? మఱియొక టేదైన నిచ్చెద ననెను. అట్లు కాదా మహర్షి కమృతమే యిమ్మని నే నంటిని. 'సరే. నేను మాలవాని వేషమున నేఁగి యమృత మీఁ జూచెదను. అతఁడు వల దని తిరస్కరించిన నేను బోయెద' నని నాతోఁ జెప్పి నీ కడకు వచ్చెను. నీవు చేతులార నమృతముఁ జెడఁగొట్టుకొంటివి. పోనిమ్ము. నా దయ నీ వమృతుఁడ వైతివి. నీవు జీవించియున్నంతకాల మెప్పుడు తలఁచిన నపుడీమరుభూమిలో మేఘములు చాలినంత వర్షమిచ్చుఁ గాక! ఆ మేఘములు నీ పేర 'ఉదంకమేఘము' లనఁ బరఁగును. చిరకాలము నీవు తపోజీవనముఁ గడపి తుదకు మోక్షమందుదు" వని యాశీర్వదించి హరి యదృశ్యుఁ డయ్యెను.

ఉదంకమహర్షి చిరకాల మట్లు జీవించి భక్తిజ్ఞానవైరాగ్య సంపన్నుఁడై మోక్ష మందెను.*

---

* భారతము అశ్వమేధపర్వము.

# మహర్షుల చరిత్రలు

## జైగీషవ్యమహర్షి

జైగీషవ్యుఁడు మహాయోగీశ్వరులలో నొకఁడు. ఈతఁడు యోగ విద్యచే సాధింపనివిషయమే లేదు. అణిమాది సిద్ధులేకాక ఆకాశగమనము, అనేక లోక గమనము మున్నగు మహా యోగసిద్ధు లీతనికిఁ గరతలా మలకములు. ఈ మహర్షి తల్లిదండ్రుల పవిత్రనామములు కాని చరిత్రలు కాని కానరావు. జిగీషువు అనఁగా జయింపనిచ్ఛగలవాఁ డని యర్థము. ఇంద్రియ జయము, యోగవిజయము, నపారముగఁ గన్నవాఁడగు టచే నీతఁడు జైగీషవ్యుఁడను సార్థకనామముఁ గన్నవాఁడయ్యెను. ఈ మహాత్ముఁ డాజన్మ బ్రహ్మచారి. కేవల పరబ్రహ్మ సంభూతులైన మహనీయులకు సంసారపు జంజాటము లేకపోవుటలో నాశ్చర్యములేదు. ఈతఁడు కపిలమహర్షితోడను దేవలమహర్షితోడను గలిసి తఱచు తిరుగు చుండువాఁడు. అంతేకాదు. ఈ యోగీశ్వరుఁడు కైలాసపర్వతమున నున్న పార్వతీ పరమేశ్వరుల సన్నిధానమున మెలఁగుచో వారికిఁ దలలో నాలుకయై తనరారువాఁడు. అవధూతవేషధారుఁడు, మహాయోగి, మహాజ్ఞానియగు నీతఁడు సర్వశక్తిసంపన్నుఁడు.

### కపిల జైగీషవ్యులయోగశక్తి

జైగీషవ్యుఁడు కపిలమహర్షికి శిష్యుఁడు, మిత్రుఁడు, సమస్తము ను. ఒకనాఁడు వీరిరువురు మహాభక్తుఁడగు అశ్వశిరుఁడను రాజును గటాక్షింప వాని గృహమున కేఁగిరి. యజ్ఞ దీక్షితుఁడై యున్న అశ్వ శిరుఁడు వారిని గౌరవించి యతిథి సత్కారము లాచరించి సుఖాసీనులఁ జేసిన పిదప వారికి సాష్టాంగ నమస్కారములొనర్చి "మహానుభావు లారా! మీ రాకచే నా గృహము పవిత్రమైనది. నేను ధన్యుఁడనైతిని. నా యజ్ఞము ఫలప్రదమైనది. దయయుంచి విష్ణుమూర్తి సత్వరకటాక్ష సంపాదనకు నే నేమి చేయవలయునో ఆనతిం" డని ప్రార్థించెను. అంత

కపిలమహర్షి "రాజా! నే నా విషయము నీకుఁ దెలుపుటకేవచ్చితిని. నన్ను విష్ణుమూర్తిగా నెఱింగి త్రికరణశుద్ధిగా సేవింపుము. నీకు సర్వ వాంఛలు సిద్ధించు" ననిపలికెను. రా జజ్ఞానియై యీవాక్యములు కపిలుని యహంకార వాక్యము లని తృణీకరించి "అయ్యో! విష్ణుమూర్తిని నే నెఱుఁగుదును. అతఁడు శంఖచక్రగదాపాణి, గరుడవాహనుఁడు. అవి లేని నీవు విష్ణుఁడవన్న నేను నమ్ముదునా?" యని పలికెను. వెంటనే యోగశక్తిచే కపిలమహర్షి శంఖచక్రగదాపాణియై విష్ణువై నిలిచెను. జైగీషవ్యుఁడును దనయోగశక్తిచే గరుడుఁడై విష్ణుమూర్తి వాహన మయ్యెను. అశ్వశిరుఁడు నమ్మఁజాలక "అయ్యా! విష్ణుమూర్తి కమల నాభుఁడు. బ్రహ్మ విష్ణు నాభి కమలమందుండి జన్మించెను. నీవు పద్మ నాభుఁడవా? నీ నాభి నుండి జన్మించిన బ్రహ్మ యేఁడి?" అని కపిలుని ప్రశ్నించెను. వెంటనే కపిలమహర్షి యోగమహత్త్వమునఁ గమల నాభుఁ డయ్యెను. జైగీషవ్యుఁడును యోగశక్తిచే విష్ణునాభికమలము నుండి జన్మించిన బ్రహ్మయై నిలిచెను. ఐనను నమ్మఁజాలక అశ్వశిరుఁ "డిది యంతయు మోసమే. నీవు విష్ణుమూర్తి వన్న నేను జచ్చినను నమ్మను. పో "మ్మనెను. వెంటనే కపిలుని యోగశక్తిచే సభాసదు లెల్లరు నంతర్ధాను లైరి. యజ్ఞశాల యంతయు భయంకర వన మృగ ములతో నిండిపోయెను. అశ్వశిరుఁ డెటు చూచినను ఘోరభయానక దృశ్యములే కాననగుచుండెను. మృత్యుదేవి దంష్ట్రిలు దీటుచు మీఁదఁ బడుచున్నట్లుండెను. అశ్వశిరుఁడు గజగజవణఁకిపోయి "మహాప్రభూ! రక్షింపుము. రక్షింపుము. నీవే విష్ణుమూర్తివి. నీతోడి జైగీషవ్యుఁడే బ్రహ్మ. మీ యిరువురకు సాష్టాంగవందనము" అని భూనభోంతరాళము లదరునట్లేడ్చుచుండఁగనే యాదృశ్య మదృశ్య మయ్యెను. సభాసదులు విచ్చేసిరి. యజ్ఞశాల సర్వమంగళసంభారములతో నిండిపోయెను. అశ్వశిరుఁ డా యోగిపుంగవుల పాదములపై వ్రాలెను. వా రాతనికి 'సర్వం విష్ణుమయం జగ'త్తను విషయమును విపులముగ బోధించి యాశీర్వదించి వెడలిరి. నాఁటినుండి కపిలభగవానునియు, జైగీషవ్యయోగీశ్వరునియు నద్భుత మహిమలు సర్వలోకములందు వ్యాపించెను *

---

* వరాహ పురాణము

## దేవలుఁడు జైగీషవ్యుని శిష్యుఁడగుట

దేవలుఁడు మహాయోగి. తాను మహాయోగి నను నభిమానము కూడ నాతని కుండెను. ఐన నాతఁడు సత్యవ్రతులలో నుత్తముఁడు. మహాతపస్వి. బ్రహ్మనిష్ఠుఁడు నని మహాఖ్యాతిగాంచెను.

ఒకనాఁడు జైగీషవ్యుఁడు దేవలునింటికి విచ్చేసెను. దేవలుఁడాతని కతిథిసత్కారము లొనరించి యాదరించెను. జైగీషవ్యుఁడు "అయ్యా! నీవు మహాతపశ్శాలివి. నీ కడనుండి నేను ప్రశాంతముగాఁ దపము చేసికొనఁ దలఁపు కలిగి వచ్చితిని. నాకాశ్రయ మిచ్చెదవా?" అని యడిగెను. జైగీషవ్యునంతటి మహా యోగీశ్వరుఁడు తనకడ కరుదెంచి యాశ్రయము కోరుట నిజముగాఁ దనయాధిక్యమును గుర్తెఱింగియే యని భావించి దేవలుఁ డానందమున నందుల కంగీకరించెను. పిదప దేవలుఁడు జైగీషవ్యునికి వలయుసౌకర్యములను గల్పించి యాతఁడందు మౌననిష్ఠ మహాతపస్వియైయుండ భోజనవేళ కాఁగానే పుష్పాదులఁ బూజించి ఫలాదుల నర్పించి యాతని నన్ని విధముల నాదరించుచు నుండెను.

ఇట్లు కొన్ని సంవత్సరములు గడచెను. జైగీషవ్యుఁడు మౌననిష్ఠ విడువక, ఉగ్రతపము సాగించుచు, ఉజ్జ్వలతేజమునఁ బ్రకాశించుచు దేవలుని నిందింపక, నందింపక, ఊలుకక, పలుకక, కలఁగక, అలుగక, కదలక, మెదలక, యుండెను. దేవలుఁడు తనయోగశక్తిని జైగీషవ్యునికిఁ జూపి యాతని మెప్పుపొందఁ దలఁచెను. ఒకనాఁ డాతఁడు జైగీషవ్యుఁడు చూచుచుండఁగనే యంతర్హితుఁడై సముద్రస్నాన కుతూహలుఁడై యొకపవిత్ర ప్రదేశమున దిగెను. అప్పటికప్పుడే యచట సముద్రస్నాన మాచరించి జపము చేసికొనుచు సికతాతలమునఁ గూర్చున్న జైగీషవ్యు నాతఁడు కాంచి తన కన్నులను దాను నమ్మలేక యాశ్చర్యభరితుఁడై తాను స్నానకృత్యమును నిర్వర్తించి యోగశక్తి నింటికి వచ్చి చేరెను. ఇంటియొద్ద యథాస్థానమున జైగీషవ్యుఁడు మౌననిష్ఠం గూర్చుండియే యుండుట దేవలుఁడు కాంచి ఆహా! నేనే యోగశక్తి సంపన్నుఁడ నన్న యహంకారము పటాపంచలైనది.

జైగీషవ్యుని ముందు నేనెంత?” యనుకొని సిగ్గుపడెను. ఐన నహంకారము మరల వచ్చి యాక్రమించెను. అంత నాతఁడు తనగొప్పతనమును నిరూపింపఁ దలఁచి జైగీషవ్యుని కన్నులయెదుట మంత్రపారగుఁడగు నాతఁడు శరవేగమున ఆకాశమున కెగిరిపోయి సిద్ధలోకమ్ముఁ జేరెను. అప్పటికే యుట నున్న జైగీషవ్యుని శిష్యులై సేవించుచున్న సిద్ధులను జూచి దేవలుఁ డాశ్చర్యపోయి యటనుండి పితృలోకమున కెగసి పోయెను. అంతకుముందే యక్కడను జైగీషవ్యుఁ డెల్లరచేఁ బూజింపఁబడుచుంటఁ గాంచెను. దేవలుఁడు వెంటనే యామ్యలోకమున కేఁగెను. అచట కూడ నదియే జరుగుచుండెను. దేవలుని యాశ్చర్యమునకు మేర లేకుండెను. మఱియు నాతఁడు సోమలోకమున కేఁగెను. అక్కడను జైగీషవ్యునకు పూజలే జరుగుచుండెను. దేవలుఁడు తనయోగశక్తి నంతయు వినియోగించి అగ్నిలోకమున కేఁగెను. అక్కడ నంతే. దేవలుఁడు తపోలోకమున కేఁగెను. అక్కడ నంతే. మిత్రావరుణలోకమున కేగెను. అక్కడ నంతియే. ఆదిత్యలోకమున కేఁగెను. అక్కడ నంతియే. రుద్రలోకమున కేఁగెను. అక్కడ నంతియే. వసులోకమున కేఁగెను. అక్కడ నంతియే. బృహస్పతి లోకమున కేఁగెను. అక్కడనంతియే. గోలోకమున కేఁగెను. అక్కడ నంతియే. బ్రహ్మసత్రి లోకమున కేఁగెను. అక్కడ నంతే. పతివ్రతా లోకమున కేఁగెను. అక్కడ నంతే. ఇట్లెల్ల లోకములందుఁ దనకంటె ముందుగా నేఁగి పూజ లందుచున్న జైగీషవ్యుని దేవలుఁడు కాంచెను. పతివ్రతాలోకమున దేవలుఁడు తెప్పపాల్పక జైగీషవ్యునిజూడ మొదలిడ నాతఁడట నదృశ్యుఁడయ్యెను. దేవలుఁడు యోగశక్తిచే నెంత యుత్నించినను, ఇఁక పై లోకమున కేగలేక, యటనున్న సిద్ధులం బిలిచి “మహాత్ములారా! జైగీషవ్య భగవానుఁ డెట కేఁగెను? ఆతనియోగశక్తి యెంతటిది? అతఁడిపు డేలోకమున నున్నాఁడు? దయతోఁదెలుపుఁడని ప్రార్థించెను.

సిద్ధులు దేవలు నాదరించి “మునీంద్రా! జైగీషవ్యుఁడు యోగీశ్వరేశ్వరుఁడు. అతఁడు శాశ్వతబ్రహ్మలోకమున కేఁగినాఁడు. నీ వది చేరుట కింకను బెక్కు వేలేండ్ల తపస్సు చేయవలయును. ఆతనికి నీపై

నెంతయో యాదరము కలదు. అందుచేత నీ యాశ్రమమునకు వచ్చి నాఁడు. అతనివలన నీ కెన్నియో శుభము లగును. మా" మ్మని పలికిరి. దేవలుఁడు, ఒక వంకనాశ్చర్యము మఱియొక వంక జైగీష వ్యునిపై భయభక్తిశ్రద్ధా గౌరవములు నిను మడించుచుండఁగా యోగ శక్తిచె నొక్కొక్కలోకమునుండియు దిగుచుఁ దనయాశ్రమమునకువచ్చి చేరెను. అచట మౌననిష్ఠతోఁ గదలక మెదలక జైగీషవ్యుఁ డాతనికిఁ గానవచ్చెను.

దేవలుఁడు జైగీషవ్యుని పాదములపైఁ వ్రాలి "మహాత్మా! నీవు సామాన్య మానవునివలె వచ్చి నా యాతిథ్య మర్థించితివి. నేను నా యోగ శక్తులు నీకుఁ జూపి నీకు వలసినశక్తు లనుగ్రహింతమనుకొంటిని. నా యహంకార ముడిపి నన్ననుగ్రహింప విచ్చేసిన పరమేశ్వరుఁడవే నీవు. నాయందు దయయుంచి కార్యాకార్యస్వరూపము, సన్న్యాస యోగము, మోక్షధర్మములు, సవిస్తరముగా నెఱిఁగింపు" మని ప్రార్థించెను. జైగీషవ్యుఁడు "దేవలా! నీవు సామాన్యునివలె నన్ను స్తుతించితివి. నీవును దక్కువవాఁడవుకావు. మౌననిష్ఠకు యోగ్యమగు తావు నీ యాశ్రమమే యగుట నిచటికి వచ్చితిని. నీవు నన్నతిథిశుశ్రూషల నలరించినావు. నా మౌనవ్రత మింతటితో సరియైనది. నన్ను శ్రద్ధా భక్తుల నీవు సేవించితివి కావున నివు కోరినను కోరకున్నను నా శక్తులు నీకు రాఁగలవు. శ్రద్ధా భక్తులతో నెవరు విప్రుల సేవింతురో వారికి సర్వ సిద్ధులు లభించును. కావుననే, సాధుసజ్జన సాంగత్యము, విబుధారాధ నము, విప్రసేవ వ్యర్థముగఁ బోవు. అవి సేవించువారి యోగ్యతనుబట్టి బహుగుణవర్ధిత ప్రతిఫలము నిచ్చితీరును" అని యాతని నేకాంత మునకుఁ దీసికొనిపోయి యాతనికి సమస్త ధర్మములు బోధించి, సందేహ నివారణ కావించి యనుగ్రహించెను. దేవలుఁ డాతనిశిష్యుఁ డయ్యెను.

జైగీషవ్య ప్రబోధితుఁ డగుదేవలుఁడు గృహస్థాశ్రమ మొల్లక సన్న్య సింపఁబూని తన నిశ్చయమును జైగీషవ్యుని కెఱింగించెను. అంతలో భూతజాలము, పితృదేవతావర్గము నాక్రోశించుచు వచ్చి గృహస్థాశ్రమ మును వీడవలదని యాతని నర్థించెను. దేవలుఁడు జైగీషవ్యు ననుమతి

గాని తనతపస్సు ధారపోసి భూతతృప్తి కలిగించి పితృదేవతల కుత్తమ గతు లొనగూర్చి పిదప సన్న్యసించి మోక్షధర్మ మవలంబించెను. బృహస్పతి ప్రముఖు లచటి కరుదెంచి దేవల జైగీషవ్యుల నభినందించిరి. దేవలజైగీషవ్య నివాసస్థానమగు నా ప్రదేశము దివ్యతీర్థ మయ్యెను.

మఱియొకప్పుడు పరమప్రాజ్ఞుఁడు పరమశాంతుఁడు పరమ సుఖియునగు జైగీషవ్యుని దర్శించి దేవలమహర్షి 'మహాత్మా! నీ యీ పరమప్రశాంతస్థితికిఁ గారణమేమి? ఏ యాచారమున, ఏ శీలమున, ఏ విద్యచే ముక్తికలుగును? తెలుపు" మని ప్రార్థించెను, అందులకు జైగీషవ్యుఁ డిట్లనెను. "దేవలా! శాంతిమంతులైనసౌమ్యులు నిష్ఠా గరిష్ఠులైయుండు ద్వంద్వాతీతస్థితి యందు నేనుందును. ఆస్థితియందు-

"వినుతించిన నిందించిన
ననఘా! మనమునఁ బ్రియంబు నప్రియమును లే
తునికియు ప్రవేసినసైనను
కనలు వొడమమియుఁ బ్రబుద్ధగణ్యగుణంబుల్.

ఒకటి కోరి దాని కుల్లంబు కుందఁగఁ
జాలఁబడమి, యేమి సంభవించె
నేని దానఁ దృప్తి నూనుట తప్పిన
పనికి వగవకునికి భవ్యగుణము.

హర్షంబును మానంబు న
మర్షము నపరాధమును సమదభావము ను
త్కర్షాపకర్షచింతలు
ఆర్ష సమాచారమున నిరస్తగుణంబుల్.

అవమానమునకుఁ దృష్టుం
డవు నమృతముఁ ద్రావినట్లు, యంచితసమ్మా
నవిధికి నుద్వేగముఁ బొం
దు విషంబునఁబోలె, శమరతుఁడు మునినాథా!

చుట్టము పగ యనుభేదం
బెట్టి జనులవలనఁ దగుల దెల్లప్పుడు! నె
ప్పట్టున నద్దానను మదిఁ
బుట్టదు సంతోషహాని బుద్ధాత్మునకున్.

ఇంద్రియముల గెల్చి హృదయంబు శాంతిసు
ఖంబుఁ బొంద నిర్వికారవృత్తి
యైనవానిపొందు మానితగతి దేవ
తలకుఁ బొంద నరిది ధర్మనిరత!"

(భార. శాంతి. ౫. ౨౩–౨౬)

అని పలికెను. దేవలుఁ డిది విని ద్వంద్వాతీతస్థితి నంది చెలు వందెను.

## జైగీషవ్యుని పార్వతీపరమేశ్వరులు పరీక్షించుట

జైగీషవ్యుఁడు పార్వతీపరమేశ్వరులు మేరుపర్వత ప్రాంతమున విహరించుచున్న సమయమునఁ బోయి యీశ్వరసన్నిధిని గూర్చుండెను.

పరమేశ్వరుని పరివార మంతయు నట విడిసియుండెను. సిద్ధ సాధ్యయక్షగంధర్వాప్సరోగణములు వారిని సేవించు నవకాశమున కెదురుచూచుచుండెను. ఆ సమయమున పార్వతీపరమేశ్వరుల ప్రసంగ వశమున పార్వతి "దేవా! అర్థ మేది? అర్థశక్తి యేది? దయ దలఁచి తెలుపు" మని భర్తను ప్రార్థించెను. పరమేశ్వరుఁ డిట్లనెను. "దేవీ! అర్థమును నేను. అర్థశక్తివి నీవు. నేను భోక్తను. నీవు భోజ్యమవు. నేను పరుఁడను. నీవు ప్రకృతివి. విష్ణుఁడను, బ్రహ్మను, యజ్ఞపురుషుఁడను నేనే." "నాథా! అర్థము, అర్థశక్తి వీనిలో నేది యధిక" మని పార్వతి పరమేశ్వరు నడిగెను. అతఁడేమియు సమాధానము చెప్పక యూరకుండెను. అపుడు జైగీషవ్యుఁడు "తల్లీ! అర్థమే అధికమైనది. అర్థశక్తియర్థమునందు లయించియున్న" దని బదులుచెప్పెను. తాను తనభర్తను బ్రశ్నింపఁగా సమాధాన మిచ్చుటకు వీఁడెవఁ డనియు, త న్నడుగనిదే పలుకుట కాతని కెంతకండకావర

మనియు పార్వతి యాతనిపైఁ గోపించెను. అది గ్రహించి జైగీషవ్యుఁ డటనుండి వెడలిపోయెను. అపుడు శివుఁడు పార్వతిని జూచి "దేవి! అతఁడు జైగీషవ్యుఁడు. మహాయోగి. మహా జ్ఞాని. మనపరమభక్తుఁడు. పరమ ప్రశాంత చిత్తుఁడు. ఆతని నట్లు కోపించితివి. ఆతఁడు నా భక్తుఁడు. సఖుఁడు. శిష్యుఁడును" అని పలికెను. అందులకు పార్వతి "దేవా! నీ నా సంభాషణమున నాతఁ డడ్డువచ్చి సమాధాన మిచ్చుట నన్నవమానించుట కాదా? మనల నాశ్రయించి వరములు గ్రహింప వచ్చిన యాతఁడు మనతో సమానస్థాయిని మాటాడి దోషయుక్తుఁడైనాఁ" డని పలికెను. దానిపై శివుఁడు "దేవీ! కాదు. కాదు. ఆతని కే వరము నక్కఱలేదు. ఆతఁ డట్టి వాశించి మనకడకు రాలేదు. ఆతఁడు ద్వంద్వాతీతుఁడు, సమ లోష్టాశ్మ కాంచనుఁడు, నిరాశి. ఆతని కింద్రత్వము, బ్రహ్మత్వము, రుద్రత్వము తృణప్రాయములు. ఆతఁడు బ్రహ్మజ్ఞాని. ఆతని నీ వట్లు తృణీకరింపరా" దనెను. అందులకుఁ బార్వతి "ఐనచో నాతని ఆశారాహిత్యమును బరీక్షింప నా కనుజ్ఞ యి" మ్మని పరమేశ్వరునిం గోరెను. ఆతఁడంగీకరించెను. అపుడు పార్వతీపరమేశ్వరులు వృషభారూఢులై కొంతపరివారము వెంట రాఁగా, పరిశుద్ధాత్ముఁడు, మునిశ్రేష్ఠుఁడు నగు జైగీషవ్యుని యాశ్రమమునకు వచ్చి చేరిరి.

ఏ కోరికయు లేక గాలిలేనిచోటఁ బ్రకాశించు దీపమువలె వెలుంగుచు, చింపిబొంతఁ దాల్చి చిద్విలాసము ముఖమునఁ దాండవింప నానంద పరవశత్వమునఁ జిందులుద్రొక్కు జైగీషవ్య యోగీంద్రుని దగ్గఱ పార్వతీపరమేశ్వరులు నిలిచి "యోగీంద్రా! నీకుఁ గావలసినవర మేదైనఁ గోరుకొమ్ము. ఎట్టి యసాధ్యవరమైన ననుగ్రహింతు" మని పలికిరి. జైగీషవ్యుఁడు వారికి నమస్కరించి శంకరుని జూచి "దేవా! నీ దయ లేనిదే యేమున్నది? నేను కృతార్థుఁడను. నాకు వలయున దేమియు లేదు" అని బదులుచెప్పెను. పార్వతీపరమేశ్వరు లాతని రెట్టించి రెట్టించి యడిగి యెన్నివిధములనో యాతనిని మభ్యపెట్టఁ జూచిరి; కాని, యాతఁడు తాను సూదియందలి బెజ్జము ననుసరించి పోవుదారమువలె నీశ్వరేచ్ఛాప్రవర్తిత జగమున నిరాశ, విజితేంద్రియుఁడునై గమించు వాఁడు గావున, నేమియుఁ గోరుకొన నొల్లఁడాయెను. నిజముగ నాత

నీకిఁ గావలసిన దేమైననున్నఁగదా కోరుట? ఏ కోరికలేనివాఁడే కోరిక కోరును? పార్వతీపరమేశ్వరు లెంత యత్నించిన నాతఁడు చలింపఁడాయెను. పరమేశ్వరుఁడు పార్వతివంకఁ జూచెను. ఆమె జైగీషవ్యుని బలుకరించి కనికరించి తాను బడ్డకోపమునకు బాధపడకు మనెను. ఆతఁ "డమ్మా! కోపతాప ప్రేమశాపము లన్నియు నాకు సమానమే" యని పలికి భక్తితో వారిని వీడ్కొలిపెను. ఈ పరీక్షలో పార్వతీపరమేశ్వరు లోడిపోయిరి. జైగీషవ్యుఁడు గెలిచెను.*

---

* భారతము అనుశాసనికపర్వము.

# మహర్షుల చరిత్రలు

## ధౌమ్యమహర్షి

తొల్లి ధర్మాత్ముఁడు, మహాతపశ్శాలి, పుణ్యచరిత్రుఁడు, వేద వేదాంగవేత్త, స్మృతికారుఁడునగు వ్యాఘ్రపాదుఁ డను మహర్షి యుండెను. అతనికి ధర్మపత్నియం దిరువురు కుమారులు కలిగిరి. వారిలో మొదటి వాఁడు ఉపమన్యువు, రెండవవాఁడు ధౌమ్యుఁడు. *

ఈ సోదరు లిరువురు బాల్యమునఁ దోడి ముని బాలురతో నాడు కొనుచు నొకమునియింటి కేగిరి. అక్కడ నొక యావును బాలు పితుకుట తొలిసారిగా వారు కాంచిరి. ఆ తెల్లనివేమని వారు తోడి బాలుర నడుగఁగా వా రవి ఆవు పా లనియుఁ జాల రుచికరములుగా నుండుననియు, అవి త్రావవచ్చు; వానితో క్షీరాన్నము చేసికొనవచ్చు. ఆ క్షీరాన్నము చాల బాగుండుననిచెప్పిరి. అది విన్న యా సోదరులకు క్షీరపాన, క్షీరాన్నభోజనకాంక్ష కలుగ వారింటికి వచ్చి తల్లిని బిలిచి "అమ్మా! మాకు క్షీరాన్నము పెట్టవే!" అని యడిగిరి.

అమాయకులగు బాలురను దల్లి కౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొని వారి కోరిక దీర్పఁ దనయింటఁ బాలు లేమికి విచారించి, ఐనను బసి బిడ్డలమనస్సు నొప్పించుట కిష్టపడక, ఉపాయమూహించి యట్లే పెట్టెద నని వారి నూఱడించి మెత్తనిపిండి నీళ్ళలోఁ జిక్కగఁ గలిపి వారికిఁ బెట్టెను. ఆ పసికందు లదియే క్షీరాన్నమనుకొని తిని మునిబాలు రన్నంత రుచికరము కాదు క్షీరాన్న మనుకొనిరి. కొన్నాళ్లయిన పిదప, నొక నాఁడు బాలు రిరువురు తండ్రితోఁగూడ బంధువులింట యజ్ఞము జరుగు చుండ నచటికిఁ బోయిరి. అచట యజ్ఞకర్త వచ్చినవారి కతిమధుర మగు పాయసాన్నము వడ్డించెను. భోజనవేళ నది తిని క్షీరాన్న మన్న నది యని వారు గ్రహించి మునిబాలురు చెప్పినది నిజమే యనియుఁ దమతల్లి పెట్టినది క్షీరాన్నము కాదనియు వారు నిశ్చయించుకొని

---

* భారతము. అనుశాసనిక పర్వము. దేవలుని సోదరుఁడు ధౌమ్యుఁడని భారతాది పర్వమునఁ గలదు.

యింటికిఁ దిరిగి వచ్చిన తరువాతఁ దల్లిని జేరి "అమ్మా! మన బంధువు లింట క్షీరాన్నము పెట్టిరే. అది అమృతమువలె నున్నదే. నీవు పెట్టిన క్షీరాన్నము చప్పగ డోకు వచ్చినది. నీవు పెట్టినది క్షీరాన్నము కాదే!" యని పలికిరి. బిడ్డలతొక్కుఁ బల్కులకుఁ దల్లి సంతోషించి కౌఁగిలించు కొని ముద్దుపెట్టుకొని "బిడ్డలారా! నిజమే. ఆవును కొనుటకు మనము ధనవంతులము కాము. దానము పట్టుటకు మీ తండ్రి యంగీకరింపరు. ఆవు లేనిదే పాలు రావుకదా; పాలు లేనిదే క్షీరాన్నమెట్లుచేసి పెట్టఁ గలను? ఈ సంగతి చెప్పినచో మీరు బాధపడుదురని మీకు మెత్తని పిండి నీళ్ళలోఁ గలిపి పెట్టితిని" అని బదులు చెప్పెను.

తల్లిమాటలు విని పిల్లలు "అమ్మా! మాకు క్షీరాన్నము కావలెనే! అది మా కెట్లు లభించునో ఉపాయము చెప్పుము. అట్లుచేసి మేము సంపాదించి నీకును బెట్టుదు" మని పలికిరి. వారి మాటలకు సంతో షించి యా సాధ్వి "వత్సలారా! ఆకలములు, కాయకూరలు తినుచు, నదీజలములు త్రాగుచు, పర్వతారణ్యతీర్థ ప్రదేశములఁ గాఁపురముండు మనవంటి తపోజపపరాయణులకుఁ బరమశివుఁడే పరమగతి. మన కేది కావలసినను, ఇహమైనను బరమైనను, చిన్న కోరిక యైనను, బెద్ద కోరికయైనను ఆ మహా దేవునే మనము ప్రార్థింపవలయును. ఆతని దయకలిగినదా మనకు క్షీరాన్నమే యేల, ఇహపరముల నెవ్వ డేది కోరిన నది సిద్ధించును. ఏ కోరికలు లేని మీ తండ్రి యా పరమేశ్వరుని పాదపద్మములను మదిఁబట్టి నిర్వికల్పసమాధిలో నిర్మలానంద మనుభ వించుచు నిలిచియున్నారు. మీకుఁ గోరిక లున్నచోఁ గోరికలఁ దీరుపఁ గల శివునే భజింపుఁ" డని యా బాలుర కుపదేశించెను.

ఆ పుణ్య సాధ్వీగర్భశుక్తిముక్తాఫలములగు నా బాలురంత "అమ్మా! తప్పక మే మట్లు చేసెదము. కాని, ఆ పరమ శివుఁ డెట్లుండును? ఎచ్చట నుండును? ఏమి చేసిన మాకుఁ బ్రసన్నుఁడగును? తెలుపు" మని ప్రార్థించిరి. పరమేశ్వర పాదారవిందభజనోత్సేకము వారికి రేకెత్తించిన యాతల్లి వారికి ఈశ్వర రహస్యోదారవిజ్ఞాన మంతయు పూసగ్రుచ్చినట్లు, అరటిపండొలిచి చేతఁ బెట్టినట్లు సమగ్రముగ స్పష్ట ముగ నుపదేశించెను. అహా! ఆ సాధ్వి మాట లెంత పాటవములు!

నిజమాతృధర్మము నామె యెంత యద్భుతముగా నిర్వహించినది! "తల్లి హరింజేరు మని యెడి తల్లి తల్లి కదా!" మిగిలినతల్లులో-పిల్లులు, బల్లులు, నల్లులు!

ఆ తల్లిమాటల కుల్లములు పల్లవింప, ఉత్సాహము నూతగాఁగొని ఉపమన్యు ధౌమ్యు లుభయులు పరమేశ్వరునిగుఱించి యుగ్రతప మొనరింపఁ దొడంగిరి. నిష్ఠాగరిష్ఠులై వారు కొన్నేండ్లు వామ పాదాంగుష్ఠములపై నిలిచియు, కొన్నేండ్లు ఫలాహారులై యుండియు, కొన్నేండ్లు జీర్ణపర్ణాహారులై యుండియు, మఱికొన్నేండ్లు జలపాన మాత్రులై యుండియు. నింకఁ గొన్నేండ్లు వాయుభక్షులై యుండియు మహాతప మొనరించిరి.

పిదప నొకనాఁడు వీరినిష్ఠఁ బరీక్షించుటకై మహేశ్వరుఁ డింద్ర రూపమున వీరికడ కేతెంచి "మీ తపమునకు మెచ్చితిని. నే నింద్రుఁడను. ఏమికోరిన నది యిచ్చెదను. కోరుకొం" డని పలికెను. ఉపమన్యుఁ డా మాటలువిని "అయ్యా! నీ దారిని నీ వేఁగుము. నిన్ను గుఱించి మేము తపము చేయలేదు. నీ దర్శనము మా కక్కఱలేదు. నీ వరములు మా కంతకంటె నక్కఱలేదు. సర్వలోకేశ్వరుఁడైన శర్వుని గుఱించి మేము తప మొనరించితిమి. మా కోరికలఁ దీరువ నాతఁడే నేరుపరి. మమ్ముఁ గాపాడినను. కాపాడినను, రక్షించినను, శిక్షించినను ఆతఁడే మాకుఁ గావలయును. ఆతని దాసత్వముతక్క మా కింద్రత్వము వలదు. బ్రహ్మత్వము వలదు" అని పెక్కువిధములఁ దమ యనన్య భక్తిభావమును వెల్లడించెను.

ఇంద్రుఁ డింక నేమి చెప్పిన నేమి యడిగిన నాలింపక యుపమన్యువు నిరర్గళపరమేశ్వరభక్తి ప్రసంగ పారవశ్యమున సమాధిస్థితి నందెను. అపు డింద్రుఁ డంతర్హితుఁ డయ్యెను. ఆతని వెనుక నింద్రుని యైరావతము హంసకుందేందు సమానమగు ధావళ్యముతో రజత మృణాళ కాంతులు రమ్యముగ వెలుంగ ప్రత్యక్షమైన క్షీరసాగరమో యన్నట్లు మనోహర సర్వాంగములతోఁ గానవచ్చెను. ఆ సోదరు లిరువురై రావతమును దిలకించుచుండఁగానది యైరావతము కాక హిమవత్పర్వత

శిఖరమంతయెత్తు గలిగి అతిస్వచ్ఛ మైనతెల్లని మహామేఘమువలె నొప్పు మిగిలిన వృషభ వాహనము నెక్కి జగన్మాతాపిత అగుపార్వతీపరమేశ్వరులు విచ్చేయుచుండిరి. వారి దివ్యతేజము భూనభోంతరాళములు గ్రమ్మి కోటి సూర్యబింబము లుదయించిన ట్లయ్యెను. వెంటనే శివుని మాయచే నా తేజమంతయు నుపసంహృత మయ్యెను. పిదప సర్వ సౌందర్యనిధు లగుపార్వతీపరమేశ్వరులు కానవైరి. వారి ననుసరించి దివ్యరూపు లగుననుచరు లుండిరి. బాలేందుకిరీటుఁడై తెల్లనిశరీర చ్ఛాయ వెలయ, ముగ్గురు సూర్యులట్లు ప్రకాశించు మూఁడు కన్ను లతో, పినాకపాణియై, సర్పహారుఁడై శివుఁడు కానవయ్యెను. ఆతని కుడిప్రక్క హంసవాహనారూఢుఁడై బ్రహ్మయు, నెడమప్రక్క గరుడ వాహనుఁడగు విష్ణువు నుండిరి. పార్వతిప్రక్క మయూరవాహనుఁ డగుకుమారస్వామి యుండెను. వారియెదుట నంది యుండెను. స్వాయంభువాదు లగుమనువులు, భృగ్వాదులగు మహర్షులు, ఇంద్రాదు లగుదేవతలు వారిని బరివేష్టించి యుండిరి. మఱియు సకలపరివార సమేతుఁడగు సర్వేశ్వరునిగాంచి ఉపమన్యుధౌమ్యు లమితభక్తినాతనికి సాష్టాంగనమస్కారము లొనరించి వేదమంత్రములచే సహస్రనామములచే స్తుతించిరి.

పరమేశ్వరుఁ డుపమన్యుని భక్తి కెంతయు నలరియాతని నేదేని వరము కోరుకొను మనెను. ఉపమన్యువు నిత్య శివభక్తి, అతీతానాగతవర్తమాన సర్వవిషయ జ్ఞానము కోరుకొని "దేవా! గోక్షీరములు, క్షీరాన్నము వీనిపైఁ గల కాంక్ష కారణముగా సర్వలోకప్రభువవగు నీ దర్శనము లభించినది. కావున నాకే కాక నా వంశమువా రెల్లరకు గోక్షీర సమృద్ధి ననుగ్రహింపుము. న న్ననుసరించిన నా తమ్ముని ధౌమ్యుని గూడఁ గటాక్షింపు" మని ప్రార్థించెను.

పరమశివుఁడు పరితోష మంది "వత్సలారా! మీరు దుఃఖవర్జితులై జరామరణశూన్యు లగుదురు. సర్వజ్ఞులు ప్రియదర్శనులు నగుదురు. అక్షయ మగు యౌవనము, అగ్నిసమాన మగుతేజము, మీకుఁ గలుగును. మీరున్న ప్రదేశములం దెల్ల గో సంపద్వృద్ధి, క్షీరసమృద్ధియై క్షీరసాగరమే యటఁ బ్రవహించును. కల్పాంతమున మీరు బంధువు

లతో నన్నుఁ గలియుదురు. నీ తమ్ముఁ డగు ధౌమ్యుఁడు దేవగణ మునిగణమాననీయుఁడై హరిప్రియులగు పాండవులకు గురువై శ్రీకృష్ణ కటాక్షము నంది చెలువొందు" నని చెప్పి పరివారసమేతముగా నంత ర్హితుఁ డయ్యెను.

పిదప ఉపమన్యువు మహర్షిశ్రేష్ఠుఁడు, పరమ విజ్ఞాని, బ్రహ్మ భావసంపన్నుఁడు, సర్వజనపూజ్యుఁడై వెలుఁగొందెను. ధౌమ్యుఁ డన్న కడ సెలవుగైకొని పోయి భాగీరథిం దాఁటి యవ్వలియొడ్డునఁ గల "ఉత్కచ" మను తీర్థమున కరిగి యాశ్రమమును నిర్మించుకొని పరమతపోజీవితమును గడపుచుండెను.*

## పాండవులు ధౌమ్యుని బురోహితునిఁగా వరించుట.

అంగారపర్ణుఁడను గంధర్వరాజు అర్జునునిచే నోడి పాండవులతోఁ జెలిమి నెఱపి వారిక్షేమముఁ గోరి వేదవేదాంగ విశారదుఁడు, జపహోమ యజ్ఞ ప్రశస్తుఁడు, సత్యవచనుఁడు, విప్రోత్తముఁడు చతుర్వర్గసాధకుఁడు, సదాచారుఁడు, సూరిజనస్తవనీయుఁడు నగునొకమహర్షిని బురోహితునింగా వరించి శుభంబులందుఁ డని సూచించెను. అగ్నిపరిగ్రహణము, బ్రాహ్మణ సంగ్రహము లేనియెడల నెంతటి మహారాజైన వంతలపాలు గాక తప్పఁ డనియు, అవి గలవాఁడు సర్వకష్టములను దాఁటి సుఖించి శుభముల నందునని యాతఁడు సోదాహరణముగాఁ జెప్పెను. అప్పు డర్జునుఁడు;

"మాకు నతిప్రియుండవు సమస్తవిదుండవు చెప్పుమయ్య యీ
లోకములోని వర్తనములుం దగువారి నెఱుంగు దెవ్వనిం
బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యు పురోహితుండుగాఁ
జేకొనువార మట్టిబుధసేవితుఁగానఁగ మాకు నెందగున్?"

(భార. ఆది. ౭. ౧౨౬.)

అని ప్రార్థించెను. త్రికాలవేది యగు నంగారపర్ణుఁ డాలోచించి తత్సమీపమున 'ఉత్కచ' మను తీర్థమునఁ దపముచేయు ధౌమ్యమహర్షి

* భారతము అనుశాసనిక పర్వము.

యన్ని విధముల నుత్తమ బ్రాహ్మణుఁ డనియు నాతనిని బురోహితునిగా వరించినఁ బాండవులకు సర్వశుభములు సమకూరుననియు సూచించెను. పాండవు లాతఁడు చెప్పిన చొప్పున 'ఉత్కచ' తీర్థమున కరిగి జగత్పూత చరిత్రుడు, సాధుజన పూజితుడు, ధార్మికుఁడు, మహాత్ముఁడు. హితమితభాషణుఁడు, బ్రాహ్మణకుల భూషణుఁడు నగు ధౌమ్యమహర్షిని బొడగాంచి యాతనికి నమస్కారము లొనరించి తమవచ్చినపనిఁ దెలిపి తమకుఁ బౌరోహిత్య మంగీకరింపు మని ప్రార్థించిరి. ధౌమ్యుఁడు వారి నతిప్రీతి నాదరించి వారికిఁ బురోహితుఁడుగా నుండ నంగీకరించెను. ఇట్లు తేజోవచోరూప బుద్ధివిభవములచే బృహస్పతి సమానుఁడై, వేద వేదాంగవేది, ఋషిసత్తముఁడు నగు ధౌమ్యుని పాండవులు పురోహితుం గావించుకొనిరి.

## పాంచాలీపరిణయము

పిదప, పాంచాలాధిపతి వీటికి వ్యాసప్రేరితులు, బ్రాహ్మణజన చోదితులునై పాండవు లేగిరి. అట జరగు ద్రౌపదీస్వయంవరమునకు వా రేగిరి. అందు రాజన్యు లెవనికిని సాధ్యముకాని మత్స్యయంత్రము నర్జునుఁ డేసి ద్రౌపదిని గడించెను. కుంతి యానతిని, వ్యాసభగవాను ని యనుమతిని పాంచాలిని బంచపాండవులకు నిచ్చి పరిణయము గావింప ద్రుపదుఁ డంగీకరించెను.

శుభలగ్నమున వివాహ మొనరింప ధౌమ్యుఁడు పౌరోహిత్యము వహించెను. పాండవులు మంగళ స్నానములు చేసి, వివాహోచిత వేషములు ధరించి, రత్నభూషణములఁ దాల్చి విచ్చేసిరి. ద్రౌపది పూర్ణేందువదనయై విదగ్ధ పుణ్యాంగన లలంకరింప లలితప్రసాధనాలంకృతాంగియై కమలాక్షి కమనీయ కాంతాసహస్రముతో నరుదెంచెను. అపుడు మహావిప్రుల పుణ్యాహరవము, మంగళగీత వాద్య మధురరవము పణవవేణు వీణారవము దిశలు మార్మోగునట్లు మ్రోయ వివాహమంగళ మారంభమాయెను. ధౌమ్యమహర్షి వివాహప్రయుక్తము లగుమంత్రాహుతులను బుధసమ్మతముగా నగ్నిహోత్రమున వేల్చెను. పెద్దల యనుమతిని ధౌమ్యుఁడు తొలుత ద్రౌపదిని ధర్మజునకుఁ బాణిగ్రహణము

చేయించెను. వెనువెంటనే యామె యీశ్వర వరప్రసాదమునఁ గన్యాత్వ దూషిత కాకుండఁ గౌమార దశ నందెను. అట్లామెను గ్రమముగా భీమార్జున నకులసహదేవులకును బాణిగ్రహణంబు చేయింప సర్వజన సమ్మోదకరముగా దేవతల పుష్పవృష్టియు, భూదేవతల యాశీర్వృష్టియు, దేవదుందుభినాద దివ్యవృష్టియుఁ గురిసెను.

పిమ్మట ద్రౌపదీసహితులై పాండవులు ధౌమ్య పురస్సరులై హస్తినాపురమునకు వచ్చి ధృతరాష్ట్రుఁ డర్ధరాజ్య మీయ విశ్వకర్మ యింద్రప్రస్థపురము నిర్మించియొసంగ వానిని స్వీకరించి రాజ్యపాలనము చేయుచుండిరి. తరువాత, నియమ భంగ మొనరించిన యర్జునుఁ డన్నల యనుమతిని ద్వాదశమాసికవ్రతము సలుపుచు తీర్థయాత్రలకుఁ బోయి ఉలూచి, చిత్రాంగదాదులఁ బాణిగ్రహణముచేసికొని ద్వారకాపురి కేఁగి కపటయతివేషమున సుభద్ర పరిచర్యఁ బడసి కృష్ణు ననుమతి నామెఁ బరిణయమై వ్రతాంతమున నామెం దీసికొని యింద్రప్రస్థపురమునకు వచ్చి యామెయందు వంశకీర్తికరుఁ డభిమన్యుఁ డనువీర పుత్రుం గాంచెను. ధౌమ్యమహర్షి యభిమన్యునికి జాతకర్మచౌలోపనయనాదు లొనరించి వేదవేదాంగములం దాతని నతిప్రవీణు నొనరించెను.

ధర్మరాజు నారద ప్రేరితుఁడై రాజసూయయాగమును జేయఁ దలపెట్టియు భయపడఁగా ధౌమ్యుఁ డాతని కభయ మొసఁగి శ్రీకృష్ణానుమతి రాజసూయ మొనర్పు మని ప్రేరేచెను. పిదప ధర్మరాజు అనంతవేదమూర్తులైన పైల ధౌమ్యులు హోతలుగా, యాజ్ఞవల్క్యుఁ డధ్వర్యుఁడుగా, కృష్ణద్వైపాయనుండు బ్రహ్మగా, సుసాముఁ డుద్గాతగా, వీరిపుత్రశిష్య గణములు మిగిలిన యాజ్ఞికులుగా, నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా, భీష్మాది రాజర్షులు సహాయులుగా, సర్వ క్రియా సమగ్రముగా షడంగసమృద్ధిగా, సంపూర్ణ దక్షిణా సనాథముగా, సకలధనధాన్యసమన్వితముగా జగన్నాథ రక్షితముగా, సకలజనానంద కరముగా రాజసూయ మొనర్చి జగద్విఖ్యాతి నార్జించెను.

అనంతరము కపటద్యూతమున ధర్మజుఁ డోడి సోదరులతోడను ద్రౌపదితోడను అరణ్య వాసమునకుఁ బోవ వారితోఁగూడ రౌద్రయామ్య

సామగానములు చేయుచు ధౌమ్యమహర్షి వెడలెను. ధౌమ్యునితోపాటు వేలకొలఁది యుత్తమబ్రాహ్మణు లగ్నిహోత్రములఁ గైకొని యధర్మ వరుఁడగు దుర్యోధనుని రాజ్యమున నుండ నిచ్ఛగింపక పాండవుల ననుసరించిరి. అరణ్యమున వీరినందఱ నెట్లు పోషించుట యని ధర్మ రాజు దుఃఖింప శౌనకమహర్షి యాతని నోదార్చెను. పిదపఁ దమ్ము లతో ధర్మజుఁడు ధౌమ్యుని చరణముల వ్రాలి "మహాత్మా! రాజ్య మంతయుఁ గోల్పోయిననేను మహారణ్యమున బ్రాహ్మణప్రవరుల నెట్లు పోషింతు? ఉపాయముఁ జెప్పు" మని ప్రార్థించెను. ధౌమ్యుఁ డాలోచించి "ధర్మరాజా! మొదట భూతజాలములు పుట్టి యాఁకలితో బాధపడుచుండఁ జూచి సూర్యభగవానుఁడు దయకలిగి యుత్తరాయణ గతి నుర్వీరసము గైకొని దక్షిణాయనగతియై యోషధులఁ బడసి రాత్రులఁ జంద్రకిరణామృతమున వానిం దడుపుచు వర్ధిల్లఁజేసి యం దన్నము పుట్టించి ప్రజాప్రాణములను గాపాడఁ దొడఁగెను. ఇది యెఱిఁగి తొల్లిటిమహారాజులు యోగసమాధినిష్ఠులై యన్న మాదిత్య మయమని సూర్యుని భజించి యన్నముఁ బడసి ప్రజల నాపదలనుండి కాపాడిరి. కనుక, నీవును సూర్యోపాసన మొనరించి సూర్యానుగ్రహ మున భూసురులఁ బోషింపు" మని యాతనికి సూర్యస్తోత్రము అష్టోత్తర శత నామ మంత్రము నుపదేశించెను.

ధౌమ్యుని యుపదేశము తలధరించి ధర్మజుఁడు పవిత్ర భాగీరథీ జలస్నాతుఁడై పరమపూతుఁడై సూర్యు నారాధింప నాతఁడు ప్రత్యక్షమై పాండవు లరణ్యవాసము చేయు పండ్రెండేండ్లును వన్యఫలమూలములు ద్రౌపది వంటచేయ అక్షయములు అనంతవిధము లగుశాకపాకములు చతుర్విధాహారములు నగు నని వర మొసంగి యంతర్హితుఁ డయ్యెను. దాన ధర్మరాజు భూసురశ్రేణి కభిమతార్థము లొసంగుచు, భోజనమునఁ దృప్తిపొందించుచు సేవించుచు నుండెను.

తదనంతరము నారదుఁడు పాండవులకడకు వచ్చి ధర్మరాజుం గాంచి ధౌమ్యానుమతమున రోమశమహర్షి చెప్పినట్లు తీర్థయాత్ర చేయు మని సూచించి వెడలెను. వెంటనే రోమశమహర్షి వచ్చి తా నింద్ర నియోగమునఁ బాండవులచేఁ దీర్థయాత్ర చేయింప వచ్చితి ననియుఁ

దానును ధౌమ్యునితోఁ బాండవులకడ నుందుననియుఁ జెప్పెను. ధర్మజుఁ డానందించి తీర్థయాత్ర లారంభించెను.

## ధౌమ్యుఁడు పాండవుల నోదార్చుట

పండ్రెండువత్సరము అరణ్యవాస మైనపిదప నొకయేఁడజ్ఞాత వాసము చేయవలసినసమయ మాసన్న మయ్యెను. అంతవఱకుఁ దనతో నగ్నిహోత్రములు తోడన కల్గి వర్తిల్లిన బ్రాహ్మణోత్తములఁ జూచి ధర్మజుఁ డిట్లనెను. "మహనీయులారా! మీతో అరణ్యవాసము ననాయాసముగాఁ గడపితిమి. ఇఁక మిమ్ము విడిచి యజ్ఞాతవాసము చేయవలసియున్నది. అందు మేము విఘ్నములు కలుగకుండ బయట పడుటకు మీ యమోఘాశీర్వచన మత్యంతావశ్యకము. కావున మ మ్మట్లాశీర్వదించి యనుగ్రహించి సెలవొసంగుఁ" డని కోరి, విషణ్ణ హృదయుఁడై డగ్గుత్తికవెట్ల ధౌమ్యమహర్షి ధర్మజుని కుత్సాహంబుఁ బుట్టింప నిట్లనెను.

"ధర్మనిరూపకత్వమున ధైర్యమునన్ మహనీయవృత్తి స
త్కర్మవిధిజ్ఞతం జతురతామహిమన్ దృఢబుద్ధి నెవ్వరున్
ధర్మజుపాటి గా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడవైన యట్టి నీ
పేర్మికి నీడె దుర్దశల పెల్లునకున్ దురపిల్లు టారయన్?"

భార. విరా. ౧. ౫౧.

"ధర్మజా! నీవే కాదు. దేవతలైన నొక్కొక్కప్పుడు శత్రువుల నోర్చుటకై తగినకాలమునకు వేచియుండ వలయును. నిషధ పర్వతమున దేవేంద్రు నంతటివాఁడు మాఱువేషమున మసలలేదా? విష్ణుమూర్తి యంతటివాఁడు అదితి గర్భమున వామనాకారత నణఁగి యుండలేదా? ఔర్వుఁడు తల్లి యూరు ప్రదేశమున నతి నిగూఢముగా డాఁగియుండలేదా? మార్తాండుఁడు గోశరీరవిలీనుఁడై యజ్ఞాతముగా నుండలేదా? వీరు కష్టముల కోర్చి తుదకు సుఖసంపద లంది సుఖించిరిగదా! నీవు నట్లే యీ కష్టముల సహించి శుభము లందు" మని బోధించెను.

ధౌమ్యునిమాటలకు ధర్మజుని మనస్సు నందలి కలంక దీఱెను. అపుడు భూసురు లంద ఱొక్కస్వరమున "మీకు దైవమనుకూలించుఁ గాక" యని పాండవుల నాశీర్వదించి ధర్మజుచే ననుజ్ఞాతులై తమతమ యగ్నిహోత్రములం గైకొని పునర్దర్శనమగుఁ గాక యని తమ తమ కోరిన చోటుల కేఁగిరి.

## ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మము లెఱింగించుట

ఆ తరువాతఁ బాండవు లైదుగురు ద్రౌపది విరాటరాజు పాలి కేగి తాము మెలఁగెడు తెఱఁగుల నేర్పఱుచుకొని కార్యనిర్ణయము చేసికొనిరి. పిదప ధర్మజుఁడు అగ్నిహోత్రములం గాపాడ ధౌమ్యుని, ద్రుపదు పురమునకుఁ బోయి నిలచునట్లు కొండఱను, ద్వారకానగరమున కేఁగి యుండునట్లు ఇంద్రసేనాదులను, నియోగించి వారెవ్వరినైన నెవ్వరైనఁ బాండవు లేమైరని యడిగిన "ద్వైతవనమున మమ్ము విడిచిపోయిరి. తరువాత నేమైరో మే మెఱుఁగ" మని చెప్పుఁ డని కోరి యభ్యంతర పరివారము నెల్లఁ బంపివేసెను. అపుడు ధౌమ్యుఁడు పాండవుల కిట్లనెను. "మీ శుభము కోరినవాఁడ నగుట మీ రెఱిఁగిన వారైనను మీకుఁ గొన్ని విషయములు చెప్పెదను. మీ రొరులను గొలిచి యెఱుఁగరు. కావున, మీ ప్రవర్తనలో నేదైన తొందరవచ్చిన ముందు కార్యగతి తప్పును. కావున మీకు సేవాధర్మములను సంక్షిపముగాఁ జెప్పెదను. సావధాన మనస్కులై యాలకింపుఁడు.

రాజగృహము చొచ్చి యుచితమైన స్థానమున వికారరహిత వేష మునఁ గూర్చుండవలయును. సమయ మెఱిఁగి రాజును సేవింపవల యును. రాజాభిమానము పొంది 'నాకే' మని గర్వపడి మరియాద తప్పిన పురుషార్థమునకు హాని కలుగును. రాజగృహముకంటె నంద ముగా నిల్లుగట్టుట కాని రాజు చేసిన పనులు చేయుట కాని యాతని విహారముల ననుకరించుట కాని తగదు. రాజు అలిగినచో పుత్ర పౌత్ర భ్రాతృ మిత్రు లనుభేదముఁ జూపరు. పూర్వపు మంచి చూడరు. రాజు మనసు చూరగొంటిమి కదాయని పలువురకు సంకటము కలుగు పను లేమి చేసినను ప్రాజ్ఞులు సంతసింపరు. అట్టివారు తప్పక తమ

చేటు తామే తెచ్చుకొన్నవా రగుదురు. కొలువులో రాజుముఖముననే దృష్టినిలిపి యాతని చూపులు చేష్టలు గ్రహింపవలయును. రాజగృహ మందలి వార్తలు పైని వినిపింపరాదు. అంతఃపురస్నేహ మెంతవారి కైనఁ బ్రమాదహేతువు. అంతకన్నఁ బ్రమాద హేతువు అందలి కుబ్జ వామన కాంతాదుల పొందు. ఉత్తమాసన వాహనాదులు రా జీయనిదే రాజసేవకులు తమంత దాము గ్రహింపరాదు. రాజు మన్నన నుబ్బక అవమానమునకు స్రుక్కక మెలఁగిన శుభము అందుదురు.

ఆవులింత, తుమ్ము, నవ్వు, ఉమియుట ఇవి బహిరంగముగాఁ గాక గుప్తములుగా నొనరింపవలయును. వైరుల దూతలతో మనసిచ్చి మాటాడరాదు. రాజునకు సంబంధించిన యేనుఁగుతోఁ గాని దోమతోఁ గాని వైరము వలదు. తా మెంత బలవంతులైనను రాజుసేవకులకు జనులపొందు మేలు. కలిమికి భోగము ఫల మనుకొని విచ్చలవిడి భోగింపక తనకెంత యున్నను అదఁకువతో భోగము అనుభవింప వలయును.''

ఇట్లెన్నియో సేవాధర్మములు ధౌమ్యుఁడు వినిపింప విని పాండవులు:

"తల్లియుఁ దండ్రియు దైవము
నెల్ల సుహృజ్జనము మీర యిట్లు గొలిచి వ
ర్తిల్లెడు తెఱంగు లెంతయుఁ
దెల్లము చేసితిరి బ్రదికితిమి మీకరుణన్."

భార. విరా. ౧. ౧౪౨.

అని కృతజ్ఞతఁ దెలిపిరి. ధౌమ్యుఁడు జాగ్రత్త యని వారిని హెచ్చరించి అజ్ఞాతవాస నిర్విఘ్నపరిసమాప్తికి హృదయ పూర్వకముగా నాశీర్వదించెను.

## పాండవులు ధౌమ్యుని వీడ్కొనుట

పిదప ధౌమ్యుఁడు శ్రద్ధతో పాండవుల ప్రయాణ సమయ మంగళార్థము లగుమంత్రములు జపించుచు నగ్నిని ప్రజ్వలింపఁ జేసి కామ్య

పూజ గావించెను. అంతఁ బాండవులు పాంచాలితోఁ గూడి అగ్నిహోత్రు నకు, పురోహితునకు ప్రదక్షిణ నమస్కారము లొనరించి ధౌమ్యునితో బయలుదేరి వెడలిరి. వా రట్లు చని చని తుదకు విరాటరాజు పట్టణము పొలిమేరలు చేరఁగనే ధౌమ్యుని వీడ్కొని ముందున కేగిరి. ధౌమ్యుఁ డును దన కర్తవ్యమును నిర్వర్తించి తన పుణ్యాశ్రమమున కేగి వసించెను.

## ధౌమ్యుఁడు ధర్మరాజు పట్టాభిషేకంబు గావించుట

తుదకు భారతఘోర రణమున విజయమును సాధించి కృష్ణుని నియోగమున బ్రాహ్మణ ప్రేరణమున ధర్మరాజు పట్టాభిషేకమున కంగీక రించెను.

పిదప సర్వసంభారములు సమకూరినతరువాత ధౌమ్యమహర్షి కృష్ణు ననుమతిఁ గొని తూర్పు పశ్చిమములకు వేదిక నలంకరించి నవరత్నఖచితము దృఢపాదము నగు భద్రపీఠమును బ్రతిష్ఠించి పులి చర్మముఁ గప్పి పూజించి దానిచుట్టు బంగారము, వెండి, రత్నములు మున్నగు వానితో నిండిన కుంభము లమర్చి వాని నిండ గంగాది పవిత్ర నదులనుండి కొనితెచ్చిన జలములనుబోసి యన్నింటికి రత్నమంగళ తరుత్వక్పల్లవ కుసుమములను, పంచగవ్యములను సమంత్రకముగా సంస్కరించి మహా మంత్రములు చదువు బ్రాహ్మణ పుంగవులతో ధర్మజుని దీసికొనివెళ్లి యా పీఠమునఁ గూర్చుండఁబెట్టి శుభాలంకృతులతో నభిరామయై యొప్పు ద్రౌపదీదేవిని బ్రక్కఁ గూర్చుండఁబెట్టి అగ్నిహోత్రు నాముఖము చేసికొని హోమమంత్ర ములు చదువుచు శుభముహూర్తవేళ కాఁగానే కృష్ణుని లెమ్మనెను. శంఖచక్రధరుఁడగు నతఁడు శంఖమెత్తి పృథివి కధిపతి వగుమని ధర్మరాజున కభిషేకము కావించెను. అంత వ్యాసభగవానుఁడు ముందు నకువచ్చి ప్రతిష్ఠిత కలశములలో నుజ్జ్వలమైనదానిని ధౌమ్యుఁ డందియుఁ గైకొని ధర్మరాజు నభిషేకించెను. తరువాతఁ బెద్దలగు రాజులు ప్రజ లలోఁ దగినవారు వచ్చి ధర్మజు నభిషేకించిరి. అపుడు పట్టాభిషేకానంత రము ధర్మజుఁ డెల్లర బహూకరించి యందఱి యాశీస్సుల నంది

భీమసేనుని యువరాజపదంబున నిలిపెను. కర్తవ్యవిచార నిశ్చయములకు సంధివిగ్రహాదులకు విదురుని నియోగించెను. ఆయవ్యయాదు లెంకించుటకు సంజయు నేర్పఱిచెను. భృత్యుల జీతనాతములకుఁ గర్మకలాపములకు నకులు నాజ్ఞాపించెను. దర్పితుల మర్దించుటకు, పర రాజుల జయించుటకు నర్జును నియోగించెను. బ్రాహ్మణ కార్యములకు శ్రౌతస్మార్త కృత్యానుష్ఠానములకు ధౌమ్యు నేర్పఱిచెను. నిరంతర పార్శ్వవర్తిగా సహదేవు నుంచుకొనెను. సమస్తవైదికకర్మ దానధర్మాదులకు ధౌమ్యునికి సర్వాధికారము లొసంగెను. అంతేకాదు. ధర్మరాజు ధౌమ్యునకు సగౌరవముగా సకల సంపదల నిచ్చి యాతనివలన దేవ పితృ పూజనములు, అతిథి తర్పణములు, వైదేశిక విప్రార్చనములు దీనానాథపోషణములు పరమసంతోషముతో నిర్వర్తింపఁ జేసెను.

ఈ విధముగా మొదటినుండి తుదివరకు ధౌమ్యమహర్షి పాండవ పౌరోహిత్య మద్భుతముగ నెఱపి సకలజన జేగీయమానుఁడై ముక్తి నందెను.*

---

* భారతము ఆదిపర్వము, అరణ్యపర్వము, విరాటపర్వము, శాంతిపర్వము.

# మహర్షుల చరిత్రలు

## బృహస్పతిమహర్షి

### జననము

కర్దమప్రజాపతి దేవహూతివలనఁ దొమ్మండుగురు కూఁతుండ్రను గాంచి యా నవకన్యకామణులను నవబ్రహ్మలకిచ్చి వివాహ మొనరించెను. అందు శ్రద్ధ యనునామె అంగిరసునిఁ బెండ్లియాడి యాతని ధర్మపత్నియై చిరకాలము పతిశుశ్రూష యొనరించెను. ఆ పుణ్యదంపతుల కడుపునఁ బుట్టినమహనీయులు ఉతథ్యుఁడు, బృహస్పతి, సంవర్తుఁడును.

వీరిలో బృహస్పతి పుట్టుకతోడనే లోకాతీత మగు బుద్ధివైభవమును సంపాదించి మించెను. ఉతథ్యుఁడు తీర్థయాత్రా ప్రవణుఁడు, తపఃప్రియుఁడు నయ్యెను. సంవర్తుఁడు మహాయోగీశ్వరుఁడు, జ్ఞానసంపన్నుఁడు నయ్యెను.

### బృహస్పతి శాస్త్రవేదియైన విధము

తొల్లి కల్పాదియందు సప్తమహర్షులగు మరీచి, అత్రి, అంగిరుఁడు, పులహుఁడు, పులస్త్యుఁడు, క్రతువు, వసిష్ఠుఁడును స్వాయంభువమనువును విష్ణుమూర్తి నుద్దేశించి చిరకాలము మహాతపము చేసిరి. వారికి విష్ణువు అదృశ్యరూపమున నిట్లు చెప్పెను. "వత్సలారా! మీరు నన్ను ధర్మశాస్త్రబుద్ధులై యాశ్రయించితిరి. భారతి మీ యందు నిలిచి సకలలోకహితకరమును మర్యాదా ప్రవర్తకము నగు ధర్మశాస్త్రము మీకుఁ గరతలామలకము నొనరించును. దాని నెల్లలోకములవారు శిరసా వహింతురు. మీరు మహోత్తమ మగు నీ శాస్త్రసారమును అంగిరసునికిఁ బుట్టి మహామతియై వర్ధిల్లు బృహస్పతి యందుఁ బ్రతిష్ఠింపుఁడు. బృహస్పతి యీ శాస్త్రరహస్యములను నా భక్తుఁడై జనించు ఉపరిచర వసువునకు బోధించును. అతఁడు దానినిఁ జక్కగ ననుష్ఠించి లోకముల

నిలుపును." ఇట్లు చెప్పి విష్ణు వదృశ్యుఁ డయ్యెను. ఆపిదప సప్త మహర్షులు ధర్మసంహితబుద్ధులైరి. కాలక్రమమున బృహస్పతి జన్మించినపిదప సప్తమహర్షులు విచ్చేసి విష్ణుమూర్తి యాజ్ఞ ననుసరించి సకలధర్మశాస్త్ర రహస్యములను బృహస్పతి కుపదేశించి వెడలిరి. బృహస్పతి ఇందువలన బుద్ధిమంతులనెల్ల బుద్ధిమంతుఁ డయ్యెను.*

## దేవగురుత్వము

సర్వశక్తిసంపన్నులు, ప్రజ్ఞానిధు లయ్యు దేవతలు తమకుఁ దగినగురువు లేకపోవుటవలనఁ దగినంతగా రాణింపలే కుండిరి. అపుడు దేవత లందఱును తమకు గురువును బడయ లోకము లెల్లగాలించిరి. భార్గవవంశమువాఁ డగు శుక్రాచార్యుఁడు, అంగిరసుఁ డగు బృహస్పతియు నిరువురే లోకమునఁ గల గురువులలో నగ్రేసరు లని తెలిసికొని, వారు చిరకాల మాలోచించి బృహస్పతియే యిరువురియందు మిన్న యని నిశ్చయించుకొనిరి. అపుడు వారందఱును శ్రద్ధాభయ భక్తి వినయవిధేయతలతో విచ్చేసి బృహస్పతి నాశ్రయించి కోటి మ్రొక్కులు మ్రొక్కి, "మహాత్మా! అజ్ఞానాంధకారమును విజ్ఞానప్రకాశమునఁ బటాపంచలు చేయు సుజ్ఞానభాస్కరుఁడే గురువు. గురుకృపాలబ్ధమగు విద్యయే శోభించును. ధర్మార్థకామమోక్షములకు, దైనందినవ్యవహార దక్షతకు గురువే పెన్నిధి. చుక్కానిలేని నావవలె గురువు లేని విద్యార్థి కాంక్షాపారమును గాంచనే లేఁడు. విబుధమణి వగు నీవే దేవతలకుఁ దగిన గురుడవు. కావున అవ్యాజకృపాయత్తచిత్తమున నుత్తమ గురుఁడవై నీవు మాకు శ్రేయ మొనగూర్పు" మని ప్రార్థించిరి.

బృహస్పతి యాలోచించి "బంగారపుఁ బళ్లెమునకైనను గోడ చేరుపు కావలయునుగదా! లేనినాఁ డది శోభింపదు. జగజెట్టులగు దేవతాధిపతులకు గురుత్వము వహించుటకంటె నాకు వాంఛింపఁ దగిన దేమున్నది? నేను గురువు నగుదు నన్న వా రంగీకరించి యుండక పోవచ్చును. వారంతట వారే వచ్చి ప్రార్థించినపు డంగీకరించుటే యుత్తమమార్గము. దేవగురుత్వము నా ప్రజ్ఞావైభవమునకుఁ దగిన స్థానము. సిరి రా మోఁకా లొడ్డుట యవివేకము. కావున నంగీకరిం

* భారతము శాంతిపర్వము.

చెడ" నని నిశ్చయించుకొని, యైనను వారిని గొంచెము పరీక్షింపఁ దలఁచి యిట్లనెను. "దేవతలారా! దిక్పాలుర వెంటఁబెట్టుకొని మీ యేలిక యగు నింద్రునితో నిట్లు చనుదెంచి సామాన్యుఁడనగు నాకు గొప్పతన మారోపించి గురుత్వము వహింపు మని నన్నర్థించుట నా యదృష్టము. ఐనను నా కించిద్జ్ఞతను నేను విన్నవించుకొనుచున్నాను. మీకుఁ దగిన గురువులు నా కంటె మిన్నలు ఎందఱో కలరు. భార్గవుఁ డగు శుక్రాచార్యునో భ్రాతృవ్యుఁ డగుసంవర్తమునినో మీ రెన్నుకొనుట యుత్తమము. కాని వారికంటె దీసికట్టును నన్నుఁ గోరుకొను టేమి వివేక?" మని వాదించెను. దేవత లంద ఱొక్కపెట్టున గురుత్వ సామ్రాజ్య సింహాసనము నధిష్ఠించుట కాతని కంటె నధికార్హత గలవా రింకొక్కరు లే రని యందుల కంగీకరింపు మని యాతనిని మఱిమఱి బతిమాలుకొనిరి. తుద కాతఁడు వల్లె యన మహాప్రసాద మని దేవతలు జయజయధ్వానము లొనరించిరి. పిదప దేవతలు దివ్య వైభవముగా దిక్పాలకులు ఇరువైపులఁ గొలువ, అప్సరోవనితలు రాగతాళలయ సంయుక్తముగ నాట్యములు సలుపుచు నడువ, ఇంద్రుని యైరావతమున నింద్రునికి ముం దాసీనునిఁ జేసి మిగిలిన బృందారకులు మందార వృష్టిఁ గురియించుచు నడువ, బృహస్పతిని దేవనగరమునకుఁ గొనిపోయి గురుసింహాసనాసీను నొనర్చి పట్టాభిషేకముచేసి యొక రొకరే యాతని పాదములకు మ్రొక్కిరి.

బృహస్పతి తనకు దేవతలవలన జరిగిన నిరుపమాన గౌరవమున కలరి వారితలలో నాలుకవలె మెలఁగుచుఁ గంటిని ఱెప్పవలెఁ గాపాడుచుఁ దనబుద్ధివైభవమునకుఁ దార్కాణగా వారికిఁ దగుసమయములఁ దగు నాలోచన లొనరించుచు నుండెను.

ఇది యిటు లుండ భృగువంశజుఁ డగుశుక్రాచార్యుఁ డవక్రబుద్ధి విక్రమమున నధికుఁడ నని గర్వించి దేవతలు గురువు నన్వేషించుచున్నా రని విని వారు తప్పక తన కడకే వచ్చి యర్థించి తననే గురువుగాఁ గైకొందు రని యాశించి యుండెను. ఇంతలో దేవతలు బృహస్పతిని గురువుగాఁ గైకొని దివ్యవైభవమున నమరావతికిఁ గొనిపోయి పూజించు



చుండి రని యెఱింగి దేవతలపై మండిపడి వారి శత్రువులగు రాక్షసు లకుఁ దాను గురువై యెల్ల దేవతలకును బృహస్పతికిని ప్రక్కలోని బల్లెమువలె నుండి తన కసి దీర్చుకొన నెంచి యుండెను. దేవతలు గురువును సంపాదించి యాతని యనుగ్రహమున గొప్పవారు కానున్నా రని విని రాక్షసులును గురుసంపాదనలో నిమగ్నులైరి. వారును వెదకి వెదకి శుక్రాచార్యునిఁ జేరి ప్రార్థించి యాతనిని దమగురువుఁ జేసికొనిరి. శుక్రుఁడును దేవతలకుఁ దగినబుద్ధి చెప్పుట కిదియే మార్గమనుకొని రాక్షసగురు వయ్యెను.

## బృహస్పతి ఉపరిచరవసువునకు గురు వగుట

పూర్వము వసు వను నొక రా జుండెను. అతఁడు సత్య శమ దమము లగు సుగుణములకుఁ బుట్టినిల్లు. విష్ణుభక్తికిఁ బెట్టినది పేరు. క్రతుకుతూహలమునకుఁ దావు. బ్రాహ్మణప్రియతకు నిధానము. అతఁడు రాజ్యము చేయునొల్లక వనమున కేగి మహాతప మొనరించు చుండ నింద్రుఁ డాతనికడ కేగి యాతనితోడి మైత్రి నెఱపి "రాజా? నీవు నాకు మిత్రుఁడ వగుము. మా వీటికి వచ్చుచుఁ బోవుచుండుము. భూపరిపాలన మానకుము. నీకు దివ్యత్వ మిచ్చితిని. నీకు రాకపోకల కొక రత్నవిమాన మిచ్చితి" నని యొసంగి యదృశ్యుఁ డయ్యెను. వసురాజు దానిని గైకొని భూమి నేలుచు స్వర్గమున కా విమానమున రాకపోక లొనరించుచుండి యింద్రమిత్రుఁడై "ఉపరిచరవసు" వనఁ బరఁగెను.

ఉపరిచరవసువు ధర్మపరిపాలన మొనరించుచు బృహస్పతికి శిష్యుఁడై యాతనివలన ధర్మశాస్త్రప్రపంచమును గరతలామలక మొన రించుకొనెను. గురుననుమతిఁ గొని యొకప్పుఁ డా రాజొక యశ్వమేధ యాగ మారంభించెను. ఆ యజ్ఞమున సప్తమహర్షులు వారితో సమాను లైన మఱికొందఱు మహర్షులు ఋత్విక్కులైరి. బృహస్పతి ఉపదర్శ నము నడపింపఁ జొచ్చెను. ప్రజాపతి పుత్త్రులగు ఏకతుఁడు, ద్వితుఁడు, త్రితుఁడు నను మునీంద్రులు సదస్యులైరి. రాజు పశుహింస మాని

యారణ్యకోద్గీతమైన వాక్యసముదాయమున విష్ణుమూర్తిని యాగభాగమును గొన నాహ్వానించెను. కరుణామయుఁ డగుహరి ఉపరిచరవసువున కొక్కనికే కానవచ్చి యాగభాగమును గొని చనెను. బృహస్పతి తనకుఁ గానరాకుండ హరి పోయె నని దుఃఖించి కన్నీరొలుక వాపోయెను. సదస్యులగు ఋషిసత్తములు రాజు నాతని నూఱడించి హరి యందఱకు లోచనగోచరుఁడు కాఁడనియు, ఐకాంతికభక్తులై యనేక వేలసంవత్సరములు భజించినవారికే యాతఁడు కానఁబడు నని తెలిపిరి. బృహస్పతి యూఱడిల్లి తనశిష్యుని యదృష్టమున కానందించి యా యాగము సుప్రయోగముగా నడపించెను.*

## బృహస్పతి యింద్రునికి బోధించిన ధర్మములు

సురాధిపుఁ డగునింద్రుఁడు సురగురు వగు బృహస్పతి నాశ్రయించి సర్వధర్మములు నెఱింగెను. ఆ సందర్భమున "మాట మంచి తనమే సమస్తప్రాణులను సంతోషపెట్టును. దానివలన యశము కలుగును. అది కలవానికి సర్వభూతజాలము సంతోషమున స్వాధీన మగును. చిఱునవ్వు ముఖమునఁ జిందులాడ హితముగను మితముగను మాటలాడ నేర్చినవాని కెల్లరును ప్రసన్ను లగుదురు. మృదు మధుర హితవచనముల నేమి చేసిన నెవ్వనికిని బాధ కలుగదు. మాటమంచి తనమున హింసించినను హింస పొందువాఁడును సంతసించు" నని తెలిపెను.

మఱియొకప్పు డింద్రుఁడు బృహస్పతిని "బ్రాహ్మణోత్తమా! నే నేమి చేసిన, నెట్లు ప్రవర్తించిన జయలక్ష్మి నన్ను విడనాడదో తెలుపు" మని ప్రార్థించెను. బృహస్పతి యిట్లు పలికెను. "ఇంద్రా! శత్రువుల నైనను గలహముచే నణంపఁ దలంపరాదు. కోపము, విరోధము అవివేకలక్షణములు. కోప భయసంతోషములను మనసులోనే యణంచుకొని పైకిఁ బ్రబల విశ్వాస మున్నట్లు ప్రవర్తించుచు లోపల నెప్పుడును నమ్మక యుండవలయును. శత్రువిషయమునను ప్రియ

* భారతము ; శాంతిపర్వము.

మునే పలుకవలయును. గాని యప్రియము పలుక రాదు వ్యర్థవివాద ముల నుండియు కొండెములు చెప్పుగుణము నుండియుఁ జాలదూర ముగా వైదొలఁగ వలయును. వేఁటకాఁడు పక్షికూఁతల నేర్చి పక్షివలెఁ గూయుచు వాని నేమఱుపాటునఁ బట్టునట్లు రాజు శత్రువులను బట్టవల యును. శత్రువు లోడిపోయినను రాజు వారి విషయమున నేమఱి యుండరాదు. జయము సంశయమైన వేళల శత్రువులతోఁ దలపడ రాదు. శత్రుబలమును సామదానభేదోపాయములచేతనే సాధ్యమైనంత వఱకు సమయఁ జేయవలయును. మెత్తగ మాటాడుట నిర్దయతో దండించుట, అలసత్వము, శత్రువంచన నెఱుఁగలేకపోవుట ఈ నాలుగు రాజ్యనాశన హేతువులు. ఒక్కవిషయమున కొక్క మంత్రియే కాని పెక్కురుమంత్రు లుండరాదు. శత్రువులు బలవంతులై యున్నపుడు వారికి నమస్కరించినను దప్పులేదు. నానావిధముల నడవడి కలవడిన వాని యైశ్వర్యమువలె, నానావిధ చిత్తచాంచల్యముగలరాజు రాజ్యము నిలువనేరదు. రా జెంతబలవంతుఁడైనను బెక్కురతో నొక్కసారి కల హింప రాదు."

మఱియొకప్పు డింద్రుఁడు బృహస్పతిని దుష్టలక్షణములను దుష్టుని దెలిసికొనువిధానమును తెలుపు మని కోరెను. బృహస్పతి యిట్లు తెలిపెను. "ఇంద్రా! పరోక్షమున దోషము లుగ్గడించుట, మంచిగుణముల కసూయపడుట, పరుల సుగుణములను వినలేక పెడ మొగము పెట్టుకొనుట, అకారణముగ మాటాడకుండుట, తలపంకించుట, పెదవి విఱుచుట, అసంబద్ధముగ మాటాడుట, వ్యర్థ ప్రతిజ్ఞ లొనరించుట, ప్రతిజ్ఞ చేసినవిషయమునుగూర్చి మరలఁ బ్రస్తావింపకుండుట మున్న గున వెన్నో దుష్టలక్షణములు గలవు. హితభాషణము, ప్రసన్నత, కృతజ్ఞతాగుణము, ఆనందము, తృప్తి, దయ, దానము, ధర్మము, సత్యము, మున్నగునవి శిష్టలక్షణములు. వీనికి విరోధగుణములే దుష్ట లక్షణములు."

## బృహస్పతి వసుమనునకుఁ దెల్పిన రాజధర్మములు

వసుమనుఁ డనురాజు తొల్లి బృహస్పతి నాశ్రయించి రాజధర్మము లాతనివలన నెఱుంగఁ గోరెను, బృహస్పతి యాతనిం గరుణించి యిట్లు

తెలిపెను, "లోకములు, లోకధర్మములు రాజమూలములు. ఇంకి పోయిన చెఱువునందలి జలజంతువులగతి యేమగునో రాజరహిత మైన రాజ్యమందలి ప్రజలగతి యట్లగును. ధర్మప్రభువుపాలన లేకపోవుచో, సూర్యచంద్రులు లేనపుడు దుష్టు లెన్నిపాపములకుఁ గడంగుదురో, యన్నిదురితములు రాజ్యమును నాశనము చేయును. రాజు లేని రాజ్యమున ధనతరుణీమానప్రాణములుఁ దక్కవు. రాజు లేనిచో సర్వము లేనట్లే. రా జున్నచో సర్వము నున్నట్లే. ప్రజలకు యాగభోగత్యాగ ములు ధర్మములు రా జున్నపుడే కొనసాగును. రాజు లేనపుడు రాగ రోగములే విహరించును. ఉత్తముఁ డగురాజు చారచక్షువై జగముఁ గనునపుడు సూర్యుఁడు, అకార్యకరులఁ దునుమునపుడు యముఁడు, సాధుసజ్జనులఁ బ్రోచునపుడు దేవతాత్మకుఁడు. అట్టి వానినిగుఱించియే సమ్రాట్టు, విరాట్టు అనుశబ్దములు పుట్టినవి. రాజునకుఁ బ్రజ శరీరము ప్రజలకు రాజు ఆత్మ; రక్షార్చనలందు ఉభయులు అన్యోన్య విరాజితులై నపుడు రాజ్యము శోభించును; లేనినాఁడు క్షోభించును."*

## బృహస్పతి మాంధాతకుఁ దెలిపిన గోప్రదానప్రభావము

తొల్లి యొకప్పుడు మాంధాత యనుమహాచక్రవర్తి చక్కగ మేసి నీరు త్రావి మందలో నమందానందమునఁ బరుండియున్న గోవుల కడకు వచ్చి, ప్రదక్షిణించి, నమస్కరించి, పరమ భక్తితో బృహస్పతిని దలంచి కరకమలములు మొగిచి బహువిధములఁ బ్రస్తుతించి ధ్యానించెను. వెంటనే బృహస్పతి యాతని యెదుటఁ బ్రత్యక్షమయ్యెను. మాంధాత మహాభక్తి నాతనిపాదములకు మ్రొక్కి, గోప్రదానవిధానముఁ దెలుపు మని ప్రార్థించెను. బృహస్పతి కరుణించి యిట్లు తెలిపెను. "రాజేంద్రా! భూదేవతల యనుజ్ఞ నంది పుణ్యదినమున నుపవాసము చేసి గోవులున్నమందకేగి నియమనిష్ఠలతో నొకరాత్రి యొకపగలు నివసించి మఱునాఁ డుదయము గోవును పేరుపేరఁ బిలిచి బ్రహ్మచెప్పిన "తల్లి గోవు, వృషము తండ్రి, గర్భప్రదేశము స్వర్గము, ధరణి సంప్రతిష్ఠ" అను వాక్యముఁ బలికి పిదప, తనపాపము లన్నియుఁ బోవు

* భారతము, శాంతిపర్వము.

టకు బ్రాహ్మణునిచేత నుదకధార విడిచి గోదానము చేయవలయును. శిష్యుఁడు, వ్రతశీలుఁడు-శాంతుఁడు, దాంతుఁడు, అక్రోధనుఁడు నగు విప్రుఁడే యిందులకుఁ బాత్రుఁడు. ఇట్టి దానముఁ జేసినవాఁడు చంద్రలోకమున సకలసౌఖ్యములు చిరకాల మనుభవించును. ఆశ్వయుజ మాసమున బహుళాష్టమి మొదలు మూఁడుదినము లుపవసించి పుణ్యమగుపసులసాల నుండి గోమూత్రము, గోమయము గ్రహించి సమస్త కామ్యసిద్ధిని బొందును.”

ఇది విని మాంధాత యట్లనేకగోదానము లొనరించి యుభయ లోకములందు శాశ్వతకీర్తిచంద్రికల నింపెను.*

## బృహస్పతి మనువునకుఁ జేసిన జ్ఞానబోధ

ఒకప్పుడు మనువు తనగురువగు బృహస్పతిని జేరి కొలిచి తనకు జ్ఞానయోగముఁ దెలుపు మని ప్రార్థించెను. బృహస్పతి యిట్లు బోధించెను. “అనఘా! సత్కర్మయోగనిష్ఠ జ్ఞానయోగమునకుఁ గారణము. అనిష్టమును పాపుకొనుటకు, ఇష్టమును సంపాదించుకొనుటకు మానవుఁడు కర్మ మొనరించును. నిజమునకు, ఇపు డేవి సుఖములో అవియే కొంతకాలమునకు దుఃఖదాయకము లగును. ఇది తెలిసికొన్న ప్రాజ్ఞుఁడు ఫలవిషయమున నపేక్షలేనివాఁడై సుఖదుఃఖముల కతీతుఁడై కామాదులకుఁ గడుదవ్వగు జ్ఞానవిశేష బుద్ధివలనఁ బరమసిద్ధి నందును. మఱియు, పరమవస్తువు ఆలంబము లేనిది; శబ్దస్పర్శరూపరసగంధవిరహితము. అందుచే నది వ్యాప్త మగుచుండునింద్రియములకు వశపడదు. పరతత్త్వమునకు స్త్రీ పుం నపుంసకత్వములు లేవు. అందుచే నది వానివానివ్యాపారముల కతీతమై దేహగత మయ్యు బోధరూపమున దీపించును. వెలుఁగుచున్నదీప మితరవస్తువులఁ బ్రకాశింపఁ జేయునట్లు మహోత్తమమగు నిత్యబోధనజ్యోతి తనప్రభవలన నింద్రియమానసముల దోషములఁ బోఁగొట్టును. రాజునకు మంత్రులాయా కార్యముల నెట్లు సూచింతురో, అట్లే పురుషున కింద్రియములు క్రియలఁ

---

* భారతము, అనుశాసనిక పర్వము.

గల్గించును. కట్టె కట్టె రాపాడిన నగ్ని పుట్టును, అట్లని గొడ్డళ్ళతోఁ జెట్లఁ గూల్చి ముక్కముక్కలుగా చెక్కపేళ్ళుగాఁ గొట్టినచో అగ్ని కనిపించునా? అట్లే శరీరమును శుష్కింపఁ జేసినంతమాత్రమునఁ బరతత్త్వము కానిపింపదు. కట్టెలకు మథన మవసరమైనట్లు జ్ఞానమునకు ఆగమోక్తమథన మావశ్యకము. ఆకాశమునఁ జూపు నిలువనంత మాత్రమున నాకాశమే లేదనుట యెంత యవివేకమో మనస్సునకు నింద్రియములకు నందనంత మాత్రమునఁ బరతత్త్వము లేదనుటయు నంతియే. వేఁటకాఁడు వల, ఉరి, ఓదము, గాలము మున్నగుసాధనములఁగొని మృగమును, పక్షిని, ఏనుఁగును, చేఁపను, పట్టునట్లే జ్ఞానులు విజ్ఞానమునఁ బురుషునిఁ జూడఁగందురు. పాముకాళులు పామునకే తెలియునట్లు బుద్ధివికారములను బోఁద్రోచు ప్రాజ్ఞుఁడు పరమపురుష నెఱుంగును. అమావాస్యనాఁడు చంద్రుఁడు కానరానంతమాత్రమున నాతనికి నాశము లేనట్లే. మనస్సునకుఁ బట్టువడనంత మాత్రమునఁ బరవస్తువు లేదనుట బుద్ధిహీనత. రాహువు గ్రమింగినచో రవిబింబము కానరాదు. రాహువు విడువఁగనే యది యథాప్రకారము కానవగును. అట్లే ఆత్మకు అవిరతి, విరతి యనునవి అజ్ఞానమువలననే ఉన్నట్లు తోఁచును. తేఱిననీటఁ బ్రతిబింబము కనిపించును. కలఁగిననీట నది కనిపింపదు. అట్లే మనస్సు ప్రశాంతస్థితి నున్నపుడు పురుషుఁడు తన్నుఁ దాను గనును. అశాంతస్థితిని గానలేఁడు. ఇంద్రియములు యథేచ్ఛముగాఁ దిరిగినచో నవి యనంతదుఃఖములం గొనితెచ్చును. అవి కట్టువడినచో సుఖ మొసంగును. కావున, ఇంద్రియము లను దొంగలబారి నుండి ఆత్మను గాపాడవలయును. మెఱుఁగుటద్దమున ముఖము బాగుగఁ గనఁబడునట్లే, పాపరహితమైన మనస్సున పురుషుఁడు తన్నుఁ దాఁ గనఁగలఁడు. ధ్యానయోగనిశ్చలమగు మనస్సు గుణములను విడిచి శాంతనిర్గుణవస్తువునందుఁ గలియును. అది పరమపదము. దాని కిఁకఁ బరము లేదు.

ఉత్తమజ్ఞానమునకు మాయ మాటగును. దానిని దొలఁగించు నుపాయముఁ జెప్పెద, వినుము. భూమిపైఁ బాదముమోపనిజంతు వెటు లేగెనో చెప్పుట యెంత కష్టమో మాయ యిట్టి దని చెప్పుట

సాధ్యము కాదు. మాయ గుణముల రూపము. దానిని దూరము తొలఁగింపఁగా, దివ్యజ్యోతి కాననగును. అది కనుటయే తన్నుఁ దాను గనుట. సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడుగుణములు పెన వేసికొని ఆత్మఁబట్టుకొనును. వానిని ద్రెంచుట వైరాగ్య మనుకొడవలి చేతనే కాని మఱి యొకవిధమున సాధ్యము కాదు.

మఱియు, మణులతోను, బంగారముతోను, వెండితోను, మట్టి మున్నగు వానితోను జేయఁబడినయనేకములగు పూసలలో దారమున్నట్లు భూతకోటు లన్నింటియందును పురుషుఁ డుండును. ఒకేభూమిమీఁద ననేక విధములగు ఓషధులు పుట్టునట్లె ఒకేబుద్ధివలన ననేకములగు కర్మలు కలుగును. జలము భూమికంటెఁ బెద్ద; తేజ మంతకంటెఁ బెద్ద; వాయు వంతకంటెఁ బెద్ద; దానికంటె నాకాశము పెద్ద; దానికంటె మనస్సు పెద్ద; దానికంటె బుద్ధి పెద్ద; పృథివ్యాదిపంచభూతములకంటెను మనోబుద్ధుల కంటెను కాలము పెద్ద. కాలాతీతుఁడై పురుషుఁ డీ జగములకుఁ బ్రభువై యుండును. ఆతని కాది మధ్యాంతములు లేవు. ఆతఁ డవ్యయుఁడు. వేదములు, నానావిధవాదములు నతనినే కీర్తించును. ఆతఁడు భవ నాశకుఁడు. అనుభవాతీతమగుశాంతమువలనఁ గనుపట్టునది. సత్ప్ర కాశము. అది తలఁపులకుఁ బలుకులకు దొరకదు. కర్మములకుఁ గాని పింపదు. ఈ ప్రకాశము అమృతము, అచ్యుతము, అమలము, అమే యము, అవ్యయము, అనంతము. యమాదుల కలవడినచిత్తము శమాతిరేకమును బొందగా దీనిని గాంచును.*

## బృహస్పతి అగస్త్యుని బ్రార్థించుట

ఇంద్రాదులకుఁ గాని దేవతలకుఁ గాని కష్టనష్టములు కలిగినపుఁ డెల్ల బృహస్పతి వారికై యెవ్వ రెవ్వరినసైనఁ బ్రార్థించి వారికి క్షేమము నొనఁగూర్చువాఁడు. వింధ్యపర్వతము పెరిగి లోక వ్యవహారము తాఱు మాఱు చేయఁగా లోకోపద్రవము వాటిల్లెను. అప్పు డింద్రాదులను వెంటఁగొని బృహస్పతి బ్రహ్మకడ కేగి రక్షింపు మని కోరఁగా నాతఁడు

* భారతము: శాంతిపర్వము.

వారి నగస్త్యుని బ్రార్థింపుఁ డని పంపెను. బృహస్పతివెనుక దేవత లెల్లరు భూలోకమునకు దిగి కాశీపట్టణముఁ జేరి యగస్త్యాశ్రమమును సమీపించి యా మహర్షికి మ్రొక్కి నిలిచిరి. అగస్త్యుఁడు వారిక్షేమ మడిగి బృహస్పతిని బహూకరించి వచ్చినపని యడిగెను. లోపాముద్రాపతిని బృహస్పతి స్తుతించి "ఋషివర్యా! నీవు ప్రణవమవు. లోపాముద్ర వేదవిద్య. నీవు తపస్సువు. లోపాముద్ర శాంతి. ఈమె సత్క్రియ. నీవు ఫలము, నీవు సూర్యుఁడవు. ఈమె చైతన్యలక్ష్మి. నీ యందు బ్రహ్మతేజము, ఈమెయందుఁ బతివ్రతాతేజము ప్రజ్వరిల్లుచు లోక క్షేమముఁ గూర్చుచున్నవి. ఈ రెండుతేజములు కలిసి మాకు క్షేమ మొసఁగుఁగాక" యని పలికి అగస్త్యునిచే వింధ్యగర్వాపహరణముఁ గావించి లోక శ్రేయముఁ గూర్చెను.*

## బృహస్పతి శుక్రాచార్యుఁ డగుట

తొల్లి యొకప్పుఁడు దేవతలకు విజయముపై విజయము రాక్షసులకు పరాజయముపైఁ బరాజయము కలుగుచుండుటఁ గని రాక్షసులు తమగురువగు శుక్రాచార్యునికడ కేఁగి మొఱ్ఱవెట్టిరి. శిష్యవత్సలుఁ డగు శుక్రుఁ డుపాయ మూహించి శంకరుని గుఱించి తప మొనరించి యాతని కరుణ వడసి మంత్రశక్తులు సంపాదించి వానివలన రాక్షసులకు విజయము దేవతలకుఁ బరాజయము సమకూర్ప నిశ్చయించుకొనెను. పిదప నాతఁ డేగి శివుని మెప్పించి యాతని సూచన ననుసరించి యుగ్రతప మొనరించుచుండెను. ఇంద్రుఁ డీసంగతి యెఱిఁగితపోభంగమునకై తనకూఁతురగు జయంతినిఁ బుత్తెంచెను. మహాసౌందర్యవతి, యౌవనవతి, గుణవతి యగు జయంతి శుక్రాచార్యునిఁ జేరి యాతనికి శుశ్రూష లొనరించుచు ననేక సంవత్సరములు గడపెను. తుట్టతుద కాతఁ డామెఁ గనికరించి కావలసినది కోరుకొను మనఁగా నామె యాతనితోడి చిరకాల సంగమసౌఖ్యముఁ గోరుకొనెను. అన్నమాట కాదనఁజాలక శుక్రుఁడు సంకేతమందిరమున నామెకోరికఁ దీర్చుచు వేలకొలఁది సంవత్సరము లుండిపోయెను.

---

* స్కాందపురాణము. కాశీఖండము.

ఈ లోఁగా బృహస్పతి శుక్రాచార్యరూపము ధరించి రాక్షసులకడ కేగి వారు తమగురువే యని నమ్మి సేవింప, వారికి వేదబాహ్య మగు ఆర్హతమతము ని ట్లుపదేశించెను. "వేదశాస్త్రములు వట్టిబూటకములు; వాదములకు భేదములకు నవి పనికివచ్చుఁ గాని ముక్తి నీయఁజాలవు. యజ్ఞములపేరఁ జేయుప్రాణిహింస, సురాపానము మిగుల గర్హ్యములు. యజ్ఞమునఁ జంపఁబడిన పశువునకు మోక్షము వచ్చునఁట. అగుచో, యజ్ఞకర్త తనతండ్రినో తల్లినో యజ్ఞపశువుఁ జేసి మోక్ష మిప్పింపరాదా? ఒకఁడు పెండ్లమును నెత్తి కెక్కించుకొన్నవాఁడు; ఇంకొకఁడు వక్షః స్థలమున నుంచుకొన్నవాఁడు; మఱొక్కఁడు నోటిలో నుంచుకొన్న వాఁడు. ఈ ముప్వురు మోక్షప్రదాత లఁట! చిత్రము కాదా?

మీకు నేను గొప్పమత మొకటి బోధించెదను. దానిని మీ రనుస రించితిరా మీకు మోక్షము కలుగును. అదియే ఆర్హత మతము. ఇందు శిఖాయజ్ఞోపవీతము లెల్లరును త్యజింపవలయును. ఆచారము మాన వలెను. దిగంబరులై యథేచ్ఛముగ నుండవలయును. జాతి మతభేదము లుండరాదు."

ఇట్లు చెప్పి బృహస్పతి రాక్షసు లెల్లరకు ఆర్హతమతము నిప్పించి వారిని ధర్మబాహ్యులను వేదబాహ్యులను గావించెను. ఈ సందర్భ మున నిజముగ శుక్రాచార్యుఁడు తనశిష్యులకడకు వచ్చెను. కాని, బృహస్పతిమతము తల కెక్కినరాక్షసులు వానిని నమ్మక ద్రోహియని పొఱదోలిరి. బృహస్పతి రాక్షసులను సర్వభ్రష్టులను జేసి యరిగిన పిదప, రాక్షసులు తాము మోసపోయిన సంగతి గ్రహించి ప్రహ్లాదపుర స్కృతులై శుక్రాచార్యునిఁ బ్రార్థించి క్షమింప వేఁడుకొనిరి. ఎట్టకేల కాతఁడు శిష్యవాత్సల్యమున వారి కిచ్చినశాపమున కవధి యేర్పఱిచి యాదరించెను.*

## బృహస్పతి మమతం గూడుట

బృహస్పతి పన్నిన కుటిలనీతిమూలముగాఁ దనశిష్యులు తన్నుఁ దృణీకరించి యవమానించిరని దానికిఁ గారకుఁ డగు బృహస్పతి

* పద్మపురాణము, బ్రహ్మాండ పురాణము

యధర్మముగ మాతృసమానం గూడి శాపపాపహతుఁ డగుఁగాక యని శుక్రాచార్యుఁడు శపించెను. ఈ శాపము కారణముగా బృహస్పతి సర్వ విద్వద్వరేణ్యుఁ డయ్యు, సర్వధర్మవిదుఁడయ్యు సర్వము మఱచిన వాఁడై తిరుగుచుండెను. భూతము సోఁకిన మానవునివలె, సురాపాన మున మదమెక్కిన త్రాగుఁబోతువలె బృహస్పతి వివేకవిహీనుఁడయ్యెను. ఆహా! సత్పురుష శాప మెంతవాని నెంత హీనుఁ జేయును!

ఇట్లుండఁగా నొకనాఁడు బృహస్పతి యన్నయగు ఉదథ్యునాశ్రమ మున కేగెను. అట, ఉతథ్యుఁడు తీర్థయాత్రల కేగియున్న కారణ మున నాతనిధర్మపత్నియు, అసమానలావణ్యవతియు, విశేషించి గర్భ వతియు నైన మమతాదేవిని గాంచెను. శాపోపహతుఁ డగునా సుర గురునకుఁ గామమోహము కలిగెను. ఏకాకినియై యున్న యా సాధ్వి మఱఁది కతిథిపూజ చేసి యాదరించెను. అంత బృహస్పతి మదనా తురుఁడై యామె కరముఁ బట్టి రతిసుఖ మిమ్మని బలవంత పెట్టెను. ఆమె నిశ్చేష్టయై తాను గర్భిణియై యున్నసంగతియు మాతృసమాన యైన సంగతియు నాతనికి గుర్తునకుఁ దెచ్చెను. ఐనను, శుక్రశాప తిమిర బద్ధుఁ డగు దేవగురున కిది యసమంజసముగఁ దోఁపలేదు. అందుచే నాతఁ డామెను బలవంతమున శయ్యకుఁ దార్చి రమించి కామోపశమ నముఁ గావించుకొనెను. తత్పతితవీర్యమును మమతాగర్భస్థుఁ డగు శిశువు వెలికిఁ దన్ని వేసెను. అమోఘ మగుబృహస్పతి వీర్యము నేలపైఁ బడి తదనంతశక్తివలన వెనువెంటనే బాలుఁ డయ్యెను. ఈ బాలుని మమతాబృహస్పతు లిరువురును విడిచి వేయఁగా భరతుఁ డనురాజు తీసికొనిపోయి పెంచెను. ఈతఁడే భరద్వాజుఁ డయ్యెను.

## బృహస్పతికి ఉతథ్యుని శాపము

తీర్థయాత్రలనుండి తిరిగివచ్చిన ఉతథ్యునకు భార్యయగు మమత జరిగిన సంగతి యంతయుఁ దెలిపెను. ఆతఁ డాశ్చర్యపడి సోదరుని చేష్ట కసహ్యించుకొని బృహస్పతిభార్య నొరుఁడు రమించునట్లును, బృహస్పతి యవమానదందహ్యమానమానసుఁ డగునట్లును శపించెను.

బృహస్పతి అయోనిజ యగు తార యను సౌందర్యవతిని వివాహమై యామెతో గార్హస్థ్యసౌఖ్యము ననుభవించుచు నుండెను. కొంత కాలమునకు శశాంకుఁడు వచ్చి బృహస్పతికి శిష్యుఁడై తారాబృహస్పతుల కత్యంత ప్రేమపాత్రుఁ డయ్యెను. బృహస్పతి యేకసంథాగ్రాహి యగునాతనికి సమస్తశాస్త్రములు నేర్పుచుఁ ప్రాణసమముగాఁ జూచు చుండెను. ఇట్లుండ నింద్రుఁడు చేయు యాగమున కేగుచు బృహస్పతి తారాశశాంకుల నింటికడ విడిచి చనెను. పరస్పర కామోపహతు లగు న య్యిరువురకు యథేచ్ఛా వ్యభిచారమునకుఁ దగిన యదను లభించెను. మహాపతివ్రత యయ్యుఁ దార భర్తకుఁ దగిలినశాపము కారణముగా సుతసముఁ డగు శశాంకునిం గూడి యాతనివలన గర్భము ధరించెను. బృహస్పతి తిరిగివచ్చి జరిగిన సంగతి గ్రహించి యిరువురినిఁ జీవాటులుపెట్టి శశాంకుని బంపివేసెను. తరువాత నాతఁడువచ్చి యేకాంతముగ నున్నపుడు తారను దీసికొనిపోయెను. తార బుధుఁ డను కుమారునింగనెను. బృహస్పతి తన భార్యను దన కిప్పింపు డని ఇంద్రాదులతోడను బ్రహ్మాదులతోడను మొఱపెట్టుకొనవలసివచ్చెను. చంద్రుఁడు తార నిచ్చుట కంగీకరింపని కారణమున నిరుపక్షముల వారికి ఘోర మగుపోరు సంభవించెను. అపుడు బ్రహ్మ వచ్చి శశాంకు నొప్పించి అయోనిజ కావున అపవిత్ర కాని తారను తిరిగి బృహస్పతి కిప్పించి యిరుపక్షములవారికి సఖ్యము నెఱపెను.

## బృహస్పతికిఁ దారవలన సుతుఁడు కలుగుట

ఈ ప్రకారము పరహస్తగతయైన తార తిరిగి బృహస్పతిహస్తమునఁ బడెను. శాపతిమిరము పై తొలఁగినకారణమున నామె మహాపతివ్రతయై యిఁకఁ దప్పుదారులు త్రొక్కక బృహస్పతినే సేవించుచుండెను. అసమానలావణ్యవతి యగునామెకు బృహస్పతి దయువలన గర్భము నిలిచెను. కాలక్రమమున నామెకు కచుఁ డను కుమారుఁ డుద్భవించెను.

కచుఁడు పెరిగి పెద్దవాఁ డగుచున్న సమయమున శుక్రాచార్యుని మృతసంజీవనీవిద్యవలన రాక్షసులకు విజయము, దేవతలకుఁ బరాజయము కలుగుచుండెను. ఉపాయాంతరమున మృత సంజీవనీవిద్య గ్రహింప వలె నని నిశ్చయించుకొన్నదేవతల కందులకుఁ దగినవాఁడు లభింపఁ డయ్యెను. తుదకు బృహస్పతియనుమతిం గొని సురలెల్లరుఁ గచుని బ్రార్థించి శుక్రాచార్యునికి శిష్యత్వము నెఱపి మృతసంజీవనీవిద్య పరి గ్రహించి రమ్మని పంపిరి. కచుఁడు దేవహితైషియై యేగి శుక్రా చార్యునికి మిగుల నిష్టుఁడై మెలఁగి యాతనికూఁతు రగుదేవయాని వలపునకు నిలయమై తుదకుఁ బోయిన పనిని సాధించుకొని వచ్చెను.

## బృహస్పతి యిచ్చినమాట దాఁటుట

మరుత్తుఁ డనురాజు యజ్ఞము చేయఁ దలఁచి బృహస్పతికడ కేగి భయభక్తియుక్తుల నమస్కరించి తన యజ్ఞమునకు యాజకత్వము వహింపు మని ప్రార్థించెను. బృహస్పతి తన యంగీకారమును దెలిపి యజ్ఞసంభారములను సమకూర్చుకొన మరుత్తున కనుజ్ఞ యిచ్చెను. మరుత్తుఁడును సురగురువు తన యజ్ఞముఁను నిర్వర్తింప నంగీకరించె నని యపరిమితానంద మంది సర్వసంభారములు సమకూర్చుకొనఁ దొడం గెను. ఇంతలో అసూయాగ్రస్తుఁడగు ఇంద్రుఁ డీవిషయ మెఱిఁగి గురువుకడ కేగి తానే యజ్ఞము చేయుదు ననియు నా యజ్ఞమున యాజకత్వము వహింపవలయునే కాని మానవుఁ డగు మరుత్తుని జన్నము నడపింప వల దని ప్రార్థించెను. శిష్యవత్సలుఁ డగుబృహస్పతి యాతని ననునయించి తాను మరుత్తుని యజ్ఞమునకుఁ బో ననియు, ఇంద్రుని యజ్ఞమునే నడిపింతు ననియు శపథము చేసెను.

ఇంతలో సర్వసన్నాహములు సమకూర్చుకొని మరుత్తుఁడు దేవ గురువునకు వచ్చి యజ్ఞ మారంభింపఁజేయు మని వర్తమాన మంపెను. దానికిఁ దాను రాఁజాల ననియు నింకొకనిం బిలిచి యజ్ఞము నడిపించు కొను మనియు బృహస్పతి మరుత్తునకు వర్తమాన మంపెను. బృహస్పతి ప్రతిజ్ఞాభంగమునకు మరుత్తుఁ డెంతయు వగచి కింకర్తవ్యతామూఢుఁడై

యుండఁగా నారదమహర్షి విచ్చేసి బృహస్పతితమ్ముఁడు మహాయోగి యగు సంవర్తుని బిలిచి యజ్ఞ మొనరింపు మని సూచించి సంవర్తునిఁ గనుంగొను తీరు, ఆతనిని వశపఱచుకొనువిధముఁ దెలిపి వెడలెను. మరుత్తుఁ డమితానంద మంది యటు లొనరించి సంవర్తుని బహుగౌరవముగాఁ దీసికొనివచ్చి యజ్ఞ మారంభించెను.

ఈ సంగతి తెలిసి యింద్రుఁ డసూయుపడి యెట్లైన యజ్ఞవిఘ్నముఁ గావింపఁ దలఁచి బృహస్పతియే వచ్చి యజ్ఞము నడిపించు ననియు, సంవర్తునిఁ బంపివేయు మనియు మరుత్తునకు వార్తఁ బంపెను. మరుత్తుఁ డంగీకరింపఁ డాయెను. ఇంద్రుఁడు కోపించి వజ్రాయుధము బంపెను. మరుత్తుఁడు సంవర్తుని శరణుచొచ్చెను. సంవర్తుఁడు వజ్రాయుధము నాపివేసి గాలివటమువలె గిరగిరఁ దిరుగుచు నొక్కచో నుండిపోవ శాసించెను. అది నిర్వీర్యమై నిలిచిపోయెను. పిదప, నింద్రబృహస్పతులకు బుద్ధివచ్చి తాము స్వయముగా వచ్చి సంవర్తుని క్షమాభిక్షముఁ గోరిరి. సంవర్తుఁడు వారి నాదరించి మరుత్తునియజ్ఞము నిర్విఘ్నముగను దివ్యముగను జరిపించెను. మరుత్తుఁడు వారిని బూజించెను. ఇంద్రబృహస్పతులు సంతోషించి వెడలిరి.*

## బృహస్పతి శనిపీడ నందినకథ

బృహస్పతి దయాళువై భూ జనులకు జ్ఞానముపదేశించి బాగుచేయఁ దలఁచి నర్మదా నదీతీరమునఁ గల యొకపట్టణముఁ జేరి 'వాచస్పతి' యని తనవాఙ్నిపుణతకుఁ బేరువడసి, శిష్యప్రశిష్యులఁ జేరఁదీసి వారికి సమస్తసౌకర్యములు స్వశక్తివలన సమకూర్చుచు నుండెను. పెక్కురు జిజ్ఞాసువు లామహనీయుని శిష్యులై పెక్కు జ్ఞానరహస్యము లాతని వలన నెఱిఁగి సంతోషించుచుండిరి.

ఇట్లుండ, ఛాయాసూర్యతనయుఁ డగుశని తండ్రిని జేరి తనకు విద్యాబుద్ధులు గఱపువిబుధగురుఁ డెట నున్నాఁ డని ప్రశ్నించెను. సూర్యుఁడు "వత్సా! నీకు విద్యాబుద్ధులు గఱపఁ గలదిట్ట యొక్క బృహస్పతియే. ఆతఁ డిపుడు నర్మదాతీరమందలి నగరమున గురుకులా

* భారతము, అశ్వమేధపర్వము

శ్రమమును నిర్మించి నిర్వర్తించుచు సకల జనులకు సర్వవిషయములు చెప్పుచున్నాఁడు. నీ వాతని నాశ్రయించి తగిన విద్యలను గ్రహించి ర" మ్మని పంపెను.

శని విద్యార్థియై విప్రబాలవేషమును ధరించి బృహస్పతి యున్న కడ కేతెంచి యాతనికి సాష్టాంగ మెఱఁగి తాను కపిలవంశీయుఁడ ననియు జ్ఞాన మాశించి వచ్చితి ననియుఁ దనకు సర్వవేదశాస్త్రములు బోధించి జ్ఞానము నొసంగు మనియుఁ బ్రార్థించెను. వాచస్పతి యానందించి శిష్యునిగాఁ జేర్చుకొని యాతనికి సర్వవిషయములు చక్కగ నేర్పెను. అతఁ డనతికాలముననే విద్యార్థుల కెల్ల మిన్నయై బుద్ధివిశారదతను గురుహృదయ మాకర్షించెను.

ఇంత బుద్ధిమంతుఁడు వీఁ డెవఁడా యని బృహస్పతి యొకనాఁడు దివ్యదృష్టిని జూడ నాతఁడు సూర్యతనయుఁ డగు శనైశ్చరుఁ డని స్పష్టముగాఁ గానవచ్చెను. బృహస్పతి యాతనిం బిలిచి "నీ వసత్య మాడి నా వలన విద్య లభ్యసించితివి. ఆ దోషమువలన నీకుఁ గ్రూర దృష్టియు, సర్వజనపీడాకరుఁ డను దుష్కీర్తియుఁ గలుగు నని శపించెను. అది విని శని "నాపీడ నీకును దప్పదు" దని ప్రతిశాపమిచ్చి "ఏమైనను, నీవు నాకు గురుదేవుఁడవు. కావ, నాపీడ నీకుఁ బ్రమాద హేతు వెంతమాత్రము కాకుండు" నని పలికి బృహస్పతిని బ్రీతునిఁజేసి వెడలిపోయెను.

బృహస్పతిశాపమువలన శని పాపగ్రహము, క్రూరదృష్టి యుతుఁడు నయ్యెను. శని ప్రతిశాపమువలన నొకనాఁడు బృహస్పతికి రాజశిశుహంత యను నిరాపనింద రాఁగా నాతని కా దేశపురాజు మరణ దండన విధింపవలసియు నేమియు ననలేక విచారించుచుండెను. ఇది యంతయు శనిగ్రహదోష మని బృహస్పతి మనమున శనిని ధ్యానిం పఁగా నాతఁడు గురుని గౌరవించి యాతఁడు నిర్దోషి యనియు, రాజ శిశు వూయెలలో సురక్షితుఁడై యున్నాఁడనియు నశరీరవాణిచే వెల్ల డింపఁజేసెను. బృహస్పతిని రాజు మంత్రులు నెల్లరు గౌరవించి క్షమాభిక్షము కోరిరి. "ఇది మీ తప్పుకాదు. ఎంతటివారికిని శనిపీడ

తప్పదు. నాకును దప్పతే"దని బృహస్పతి యందఱ నోదార్చెను. శని యటఁ బ్రత్యక్షమై గురుపాదములఁ బడి క్షమింప వేఁడుకొనెను. దేవగురు వాతని నాదరించి యుత్తముల జోలికిఁ బోవల దని హెచ్చరించి వీడుకొలిపెను.*

## బృహస్పతిస్మృతి

బృహస్పతి చెప్పినధర్మము లన్నియు "బృహస్పతిస్మృతి" యనుపేర విలసిల్లుచున్నవి. ఇంద్రుఁడు బృహస్పతిని జేరి భయభక్తులతోఁ దనకు ధర్మములు చెప్పు మని ప్రార్థించుటయు బృహస్పతి కరుణించి యాతనికి ధర్మములు వివరించె ననియు నిందుఁ గలదు.

## బృహస్పతిస్తుతి

"నమ స్సురేంద్రవంద్యాయ
దేవాచార్యాయ తే నమః,
నమ స్తేఽనంతసామర్థ్య
వేదసిద్ధాంతపారగ ।
సదానంద నమ స్తేస్తు
నమః పీడాహరాయ చ,
నమో వాచస్పతే తుభ్యం
నమ స్తే పీతవాససే.
నమోఽద్వితీయరూపాయ
లంబకూర్చాయ తే నమః,
నమః ప్రహృష్ట నేత్రాయ
విప్రాణాం పతయే నమః.

* శివపురాణము, సనత్కుమారసంహిత.

నమో భార్గవశిష్యాయ
విపన్నహితకారిణే,
నమస్తే సురసైన్యానాం
విపత్త్రాణహేతవే.
బృహస్పతిః కాశ్యపేయో
దయావాన్ శుభలక్షణః,
అభీష్టఫలద శ్రీమాన్
శుభగ్రహ నమోస్తు తే."

---

# మహర్షుల చరిత్రలు

## మంకణమహర్షి

### జననము

తొల్లి మాతరిశ్వుఁ డను తపశ్శాలి సుకన్య యనుకన్యను బెండ్లి యాడి యామెవలన నొకసుపుత్త్రుని గాంచెను. అతఁడు మంకణుఁ డనియు, మంకణకుఁ డనియు నామముల నొప్పి, వయసు వచ్చినంతనే తలిదండ్రుల యనుజ్ఞ గైకొని వెడలి సప్తసారస్వత మనుతీర్థప్రదేశమున నాశ్రమమును తపోనిమిత్తము నిర్మించుకొనెను.

### ఆశ్రమము

సద్బ్రహ్మచారి, సత్తపః ప్రవణుఁడు నగుమంకణమహర్షి యాశ్రమము నానాద్విజగణ సమన్వితము. అందు బదరములు, ఇంగుదములు, కాశ్మర్య, ప్లక్ష, విభీతక, అశ్వత్థము లను వివిధ వృక్షములు, కంకోలములు, పలాశ, కరీరు, పీలుజాతుల చెట్లును బహుమనోహర భంగులఁ బెరిగి యా ప్రదేశము నతిమనోజ్ఞ మొనర్చెను. అందుఁ బెరిగిన కదళీవనములో జలవాయుఫలపర్ణాహారులు, దంతోలూఖలికులు, అశ్మకుట్టులు, వానేయులు నగుపెక్కు విధముల మునులు జపతపోధ్యానాసక్తులై నివసించుచుండిరి. వారి యునికి వలన ఆ ప్రదేశము నిరంతర స్వాధ్యాయఘోషతోను, సాధు మృగశతములతోడను, అహింసకులు, పరమ ధర్మపరులు నగుజనములతో నొప్పారుచుండెను.

### సప్తసారస్వతము

పూర్వ మొకప్పుడు బ్రహ్మ ఋషీశ్వరుల నెల్లరిని బిలిపించి సర్వకామసంసిద్ధిదమగు సత్త్రయాగము నొకదానిని జేయ సమకట్టెను. యజ్ఞదీక్షితుఁడై పితామహుఁ డుండఁగాఁ గొందఱు ఋషులు సరస్వతీనది యటఁ బ్రవహింపనిలోపము దక్క నింకేలోపము లేదనుకొనిరి. ఆ మాట

విన్న బ్రహ్మ ఋషులయెడ దయాళుపై సరస్వతిని స్మరించెను. వెంటనే సరస్వతి ప్రత్యక్షమై 'సుప్రభ' యనుపేర నటఁ బ్రవహించెను. మహర్షు లెల్లరు నానంద భరితులైరి.

తరువాత, నైమిశారణ్యమునులు సత్త్రయాజులై తన్నుఁ బ్రార్థింపఁగా సరస్వతి వచ్చి 'కనకాక్షి' యనుపేర నటఁ బ్రవహించి వారికి సంతోషమును సమకూర్చెను.

మఱియొకప్పుడు గయుఁ డనుమహారాజు యజ్ఞముచేయుచు యాగదీక్షితుఁడై యా సరస్వతిని బ్రార్థింప నామె విచ్చేసి కరుణా కటాక్షము మెఱయ గయదేశములఁ దడుపుచు 'విశాల' యనుపేరఁ బ్రవహించెను.

ఇంకొకప్పుడు ఉద్దాలకుఁ డనుమహర్షి యజ్ఞముచేయుచు మునీంద్రులకుఁ జేతోమోదము కలిగించుకొఱ కామెఁ బ్రార్థింప సరస్వతివిచ్చేసి వల్కలాజినధారు లగు మునివరుల కోరికచొప్పున 'మనోరమ' యనుపేర నటఁ బ్రవహించెను.

తదుపరి, కురుక్షేత్రమున కురువు చేయు యాగవేళఁ బ్రత్యక్షమై సరస్వతి 'సురేణువు' లేక 'సురతన్వ' అనుపేరఁ బ్రవహించెను.

మఱియొకప్పుడు వసిష్ఠమహర్షి చేయు యజ్ఞమునకుఁ బిలువఁబడి సరస్వతి 'ఓఘవతి' లేక 'ఓఘమాల' యనుపేరఁ బ్రవహించెను.

ఇంకొక్కవేళఁ బరమేష్ఠి చేయు యజ్ఞవేళల విచ్చేసి సరస్వతి 'విమలోదక' 'సువేణి' యను పేళ్ళతో రెండువిధములఁ బ్రవహించెను. ఈ యేడునదులు కలిసినతావే సారస్వతతీర్థము. అదియే మంకణ మహర్షి యేర్పఱుచుకొన్న ఆశ్రమోపాంతప్రదేశము.

## మంకణునిమహిమ

మంకణమహర్షి యస్ఖలితవీర్యుడైఁ గౌమార బ్రహ్మచర్యమున నుండఁగా నొకనాఁడు సరస్వతీనదిలో స్నానము చేయుచుండఁగా

సమీపమున నొకయప్సరస అతిమనోహరదేహసౌందర్యము దిశలఁ బ్రకాశింప దిగంబరయై కానవచ్చెను. ఆమెను జూడఁగనే మంకణునికి వీర్యస్ఖలనము కా నుండెను. మహాతపుఁ డగునాతఁడు వీర్యము నొక కలశమున విడిచి తీసికొనిపోయి కాపాడెను. ఆ కలశమున నా వీర్య మేడు శకలము లయ్యెను. క్రమముగా నందుండి వాయువేగుఁడు, వాయుబలుఁడు, వాయుఘ్నుఁడు, వాయుమండలుఁడు, వాయుజ్వాలుఁడు, వాయురేతుఁడు, వాయుచక్రుఁడు అను నేడుగురు మహర్షులు జనించిరి. వీరే తరువాత మరుద్గణములకు జనకు లయి విలసిల్లిరి. దీనితో మంకణుని మహిమ ముల్లోకముల వ్యాపించెను.*

## మంకణుని మహిమ నృత్యము

తపః ప్రవణుఁ డగుమంకణుని శరీరమున కొకప్పుడొక దర్భ గ్రుచ్చుకొనెను. దానినుండి యాశ్చర్యకరముగా శాకరసము స్రవింపఁ దొడఁగెను. అది చూచి యాతఁడు మిగుల సంతోషించి తన తపము మిక్కిలి శక్తివంత మైనదని యానందాతిరేకమున గంతులు వేయుచు నృత్యము చేయఁ దొడఁగెను. ఆతనితోపాటు జంగమస్థావరము లన్నియు నొక్క పెట్టున ముగ్ధమై నృత్యముచేయ మొదలిడెను. దానితో గొప్పకోలాహలము బయలుదేఱెను. తెగతెంపు లేని యా మహర్షినృత్యము, దాని ననుసరించిన యావజ్జంగమస్థావర కోటినృత్యము కారణముగా లోకములు తల్లడిల్లఁజొచ్చెను. దేవతలు గజగజలాడిరి. అపుడు బ్రహ్మాదులు మహర్షులఁ దీసికొని మహాదేవుఁ డగుశివుని దర్శించి యా మహర్షి నృత్యము నాతనివెంట సకలస్థావర జంగమనృత్యము, దానివలనఁ గలిగిన లోకోపద్రవము విన్నవించుకొని యానృత్య మాఁగిననే కాని లోకమున స్తిమిత ముండదని ఘోషించిరి.

మహేశ్వరుఁడు వారి కభయ మిచ్చి వెంటనే మంకణుఁడు తపము చేయుప్రదేశమునకు విచ్చేసి దేవహితముఁగోరి "మహాత్మా! తపః

* భారతము అరణ్యపర్వము, శల్యపర్వము.

ప్రధానజీవనుఁడగు నీ కీనృత్య మేలః నీ వింతహర్షభరితుఁడ వగుటకుఁ గారణమేమి"? యని యడిగెను. "మహాత్మా! నాచేతినుండి శాక రసము స్రవించినది. అదియే నానృత్యమునకుఁ గారణ" మని మంకణుఁడు బదులు చెప్పెను. వెంటనే మహేశ్వరుఁడు "ఇది యెంతటి విశేషము? తపము లిట్టివే? చాలు నర్తనము మాను" మని యా ముని యంగుష్ఠమును తన వ్రేలితో గీఱెను, ఆ గాయమునుండి మంచును మించిన బూడిద కాఱెను. తత్క్షణము మంకణుఁడు మహేశ్వరుని పాద ములపై వ్రాలి తనతపోగర్వ మణఁగిన దనియుఁ దన్ను క్షమించి తనకుఁ దపః పతనము కలుగకుండఁ జేయు మని—

"దైవమెల్లఁ దలఁప నీవ సమస్తజ
గంబులకును నేడుగడయు నీవ
కర్మఫలదుఁడవును గర్మప్రదుండవు
నీవ కరుణ నన్నుఁగావు మభవ!"

భార. శల్య. ౨ ఆ. ౧౬౨.

అని మఱిమఱి ప్రార్థించెను.

అంత శివుఁడు ప్రసన్నుఁడై మంకణుని తపఃప్రభావ మక్షీణ మగు నట్లు తాను సప్తసారస్వతమున నిలిచి దానిని సేవించువారి కిహపరము లిచ్చెదనని వరమిచ్చి చనెను. అంతట మంకణ మహర్షి నృత్యము మానెను. ఆతనితో స్థావరజంగమ ప్రకృతి యంతయు నృత్యము మానెను. జగముల సంక్షోభము శాంతించెను. *

## మంకణుని కుమారునికథ

మంకణమహర్షి పరమగుణోత్తరుఁడయి కాలక్రమమున నొక కన్యం బెండ్లాడి గృహస్థధర్మముల ననుపమానముగా జరిపి యొక

* భారతము. పద్మపురాణము ఆదిఖండము.

సుపుత్రుని గాంచెను. అతఁడు అకథుఁ డనుపేరఁ బెరిగి యుక్త వయస్కుఁ డయ్యెను.

అకథుఁడు వయసు గన్నంతనే సుశోభన యనుకన్యామణిని గాంతగా గ్రహించి తపోజీవనము గృహస్థజీవనము సమ్మిళిత మొనర్చి కపోతవృత్తిని జీవించుచుండెను. ఆ పుణ్యదంపతులకు యదృచ్ఛా లాభసంతుష్టి న్యాయ్యపథ గమనము రెండే సంసారమున ముక్తిసాధనము లయ్యెను. అన్యాయ మార్గమున లభించినది మేరువంత బంగార మైనను వారు ముట్టరైరి.

ఒకప్పుడు న్యాయమార్గమున నా దంపతుల కన్నము దొరక దాయెను. అందుచే వారైదుదినము లుపవసించిరి. ఆఱవ నాఁడించుక యన్నము వారికి లభించెను. అదియే పదివే లనుకొని అకథుఁ డా యన్నమును దేవతార్చన మైనపిదప రెండుభాగములుచేసెను. సుశోభన పతి కాకు వైచి యందులో సగ మన్నమును వడ్డించి యారగింపు మనువేళకు "అమ్మా! అతిథిని" అను కేక వారికి వినఁబడెను. అకథుఁడు వెంటనే లేచి ద్వారముకడ కరిగి అతిథి నతిగౌరవమునఁ దీసికొనివచ్చి తనకయి వడ్డించుకొన్న యాకునఁ గూర్చుండఁబెట్టి యాతని చేత నాపోశన వడ్డించెను. ఆ యతిథి అ యన్న మారగించి యా దంపతుల నాశీర్వదించి వెడలెను.

ఇంతలో నింకొక యతిథి యంగవికలుఁడయ్యు ననుపమతేజస్వియై వచ్చి యాఁకలి గొన్నవాఁడ; నన్న మిడుఁ డని ప్రార్థించెను. అకథుఁడు వెంటనే లోని కరిగి తన కాంతను బిల్చి "కాంతా! మిగిలిన సగ మన్నము రెండుభాగములు చేసి యొకభాగ మతిథి కిడి రెండవ భాగమును నీవు తిని ప్రాణములు నిలుపుకొను" మని పలికెను. అంత నాసాధ్వి "నాథా! ప్రాణబంధువైన అతిథిని, ప్రాణాధికుఁడైన పతిని విడిచి నేను తిందునా? మీ యుభయులకు వడ్డించెదను. కుడువుండు. అది పతివ్రతనగు నా ధర్మము!

"తాను జేసిన ధర్మంబె తన్నుఁ గావ
వలయుఁగాని మఱొక్కఁ డెవ్వఁడును రాఁడు
కంఠమునఁ జుట్టి పాశంబుఁ గాలభటులు
కనికరము లేక లాగెడి కాలమందు"

పద్మ. పాతాళ. ౨౨౪౫

అని పలికెను.

ఆకథుఁ డా పలుకుల కానందించి "గృహస్థ ధర్మమతిథి పూజ. కావున, ముందు మన మతిథికిఁ గడుపునిండఁ బెట్టి తద్భుక్త శేషాన్న మేమైన నున్నచో మనసంగతి చూచుకొందము. నీవు సర్వము సిద్ధము చేయు" మని భార్య కాదేశించి యతిథిని లోనికిఁ గొనివచ్చి పీఁట వేసి కూర్చుండఁ బెట్టఁగా నామె పాత్ర యుంచి యం దన్న మంతయు వడ్డించి భుజింపఁ బ్రార్థించెను. ఆ దంపతుల యతిథిపూజావిధానమున కత్యంత మలరి యా యతిథి శివుఁడై నిలిచెను. ఆ దంపతు లాతని పాదములఁ బడి యాతని పదపంకజభక్తి నిమ్మని ప్రార్థించిరి. శివుఁడు వారి కా వర మనుగ్రహించి యదృశ్యుఁడయ్యెను.*

---

* పద్మపురాణము, పాతాళఖండము.

# మహర్షుల చరిత్రలు

## మృగశృంగమహర్షి

## (వత్సమహర్షి)

### వత్సుని జననము

తొల్లి కృతయుగమున రథంతరకల్పమందు కుత్సుఁడను విప్రో త్తముఁడు విరాజిలుచుండెను. వేదశాస్త్రాదివిద్యల నేర్చి యాతఁడు కాలక్రమమున కర్దమప్రజాపతికన్యకలలో నొకతెను ధర్మపత్నిగాఁ బరిగ్ర హించి గార్హస్థ్యధర్మముల నద్వితీయముగా నడపించుచుండెను. ఇట్లుండ నా మహనీయుని దయవలన గర్భము ధరించి యాతనిపత్ని నవమాస ములు నిండినంత నొకసుపుత్రుని గాంచెను. ఆతనికి వత్సుఁ డను పేరిడి తల్లిదండ్రులు పెంచిరి. ఆతఁడు యుక్తవయస్సు గన్నంతనే ఉపనయన మొనరించి కుత్సుఁడు బ్రహ్మచర్యాశ్రమమును నడప నాతని నియోగించెను.

### వత్సునితపశ్చర్య

వత్సుఁడు బ్రహ్మచర్యాశ్రమధర్మముఁల నతిశ్రద్ధాభక్తుల నిర్వ హించుచు దైవికముగా నొకనాఁడు కావేరీతీరమునకు వచ్చెను. సము ద్రముఁ జేరునదులలో ఉదగ్వాహినులు పశ్చిమవాహినులు ప్రశస్తము లనియు, అవి పవిత్రముచేయు భూభాగములు నివాసయోగ్యము లనియు నెఱింగినకారణమున, పశ్చిమముఖముగాఁ బ్రవహించుకావేరీ పవిత్రతీరమున నాతఁడు నివసింపఁ దొడఁగెను. ఆతఁ డట నుండి శాస్త్ర విధుల ననుసరించి స్నానజప తపోధ్యానపరాయణుఁడై మూఁడు మాసము లుండి తత్త్వజ్ఞానసంపన్నుఁ డై నంత మమత్వమును విడ నాడి బయలుదేఱి పోయి సహ్యజానది కుత్తరభాగమునఁ గలనారాయు ణాద్రియందు నివాస మేర్పఱుచుకొని తపశ్చర్యకుఁ గడంగెను.

## వత్సునకు మృగశృంగుఁ డనుపేరు కలిగినవిధము

నారాయణాద్రికి సమీపమునఁ గల్యాణతీర్థ మనుపవిత్ర తీర్థ ముండెను. ఆ తీర్థమునఁ బ్రతిదినము స్నానము చేసి యాతఁ డుగ్ర తపమునకుఁ గూర్చుండి ఆత్మజ్ఞానసంపన్నుఁడై యానందమున సర్వము మఱచి సమాధి నిమీలితాక్షుఁడై యుండెను. ఇట్లు కొంతకాల మగుసరి కాతనికి దేహస్మృతియే పోయెను. అతనిశరీర మెండుకట్టెవలె నిలిచియుండెను. ఆ ప్రాంతమున విహరించు లేళ్ళు ఆ తీర్థమునందలి నీళ్ళు త్రాగి తమశృంగములచే మ్రోడువలె నున్న ఋషిశరీరమును గాయుచుండెడివి. ఆ మహనీయున కిది తెలియనే తెలియదు. ఇట్లను దినము మృగశృంగముల గాపుడుపడుచున్నను తెలియనిస్థితిలో నాతఁడు పెక్కేండ్లుండెను. సమీపమునఁ గల ఋషు లీచిత్రముఁ జూచి యాతనికి మృగశృంగుఁ డనుపే రిడిరి.

## వత్సునకు విష్ణువు ప్రత్యక్ష మగుట

ఇట్లనేకవత్సరములు గడచినపిదప వత్సునితపమునకు మెచ్చి విష్ణుమూర్తి వచ్చి యాతనిసహస్రార మంటఁగనే వత్సుఁడు కన్నులు తెఱచి యెదుటఁ బ్రత్యక్షమైననారాయణునికి భయభక్తి శ్రద్ధావినయవిధే యతలతో సాష్టాంగనమస్కార మొనరించి, ఆనందవిశేషమున నొడ లంతయు గగుర్పొడువ ఆనందబాష్పములు జలజల రాలఁ గడుభక్తితో నాతని నిట్లు స్తుతించెను. "దేవాదిదేవా! ధర్మసంస్థాపనార్థము నీవు భూమి నవతరించుచుందువు. విశ్వసృష్టిస్థితిలయములు నీచేతిలోనివి. ఒక్కఁడ వయ్యుఁ బెక్కురూపములఁ జెలువారు చిత్స్వరూపుఁడవు. నీవు అణువుకంటె నణువవు; మహత్తుకంటె మహత్తువు. అమేయుఁడవు. నిర్వికారుఁడవు. నిర్గుణుఁడవు. నిన్ను నేను శరణుచొచ్చెదను. నన్ను నీవు కాపాడుము."

హరి కరుణించి యాతనితో నిట్లనెను: వత్సా! నీ భక్తికి మెచ్చి తిని. నీ తపశ్శక్తికి దర్శన మొసంగితిని. నీవు భవిష్యజ్జన్మమున ఋభు వనుమహర్షివై జన్మించెదవు. అది నీకుఁ గడపటిజన్మ. నేఁటిపఱకు నీవు

బ్రహ్మచర్యమున ఋషుల సంతోష పెట్టితివి. ఇట్లే యజ్ఞములచే దేవతలను సంతానముచే పితృదేవతలను సంతోషపెట్టుము." వత్సుఁ డమితానందమంది పరమేశ్వరుని యవ్యాజవాత్సల్యమున కంజలి ఘటించి యాతని నా తీర్థమున నిలిచియుండఁ బ్రార్థించెను. శౌరి యట్లే యని యాతని ననుగ్రహించి యదృశ్యుఁ డయ్యెను.

మృగశృంగుఁ డింటి కేఁగి తలిదండ్రులకు జరిగిన సంగతి యంతయుఁ దెలియఁజెప్పి వారి నానందపఱిచి వారికి సేవచేయు చుండెను. కుత్సుఁ డొకనాఁడు తనమిత్రుఁడైన ఉతథ్యునకుఁ దన పుత్రుని వృత్తాంతమును వినిపించెను. ఆతఁ డమితానంద మంది తన కూఁతురు సువృత్త యనునామె మూఁడు సంవత్సరము లట్లే మాఘ మాసస్నాన మాచరించి వ్రతము సలిపె నని వివరించి సువృత్తను వత్సున కిచ్చి వివాహముచేయ నూహించెను. కుత్సుఁ డాతనియూహ గ్రహించి తనపుత్త్రున కాతనిపుత్త్రిక నిమ్మని ప్రార్థించెను. ఉతథ్యుఁడు తప్పక యిచ్చెద నని వాక్రుచ్చెను. ఆనందాతిశయమునఁ గుత్సుఁ డింటి కేఁగి సుతుఁ డగువత్సునకు జరిగిన సంగతిఁ దెలిపెను. వత్సుఁ డును దనయంగీకారమును దెలిపెను.

కాని, దైవవశమున నింతలో నొకమహావిపత్తు సంభవించెను. ఒకనాఁ డరుణోదయమున సువృత్త ముప్వురు చెలికత్తెలతోఁ గూడి కావేరీస్నాన మొనరించి తిరిగి వచ్చుచుండఁగా, నొకమదగజము పరుగు పరుగున వారిపైకి రాఁజొచ్చెను. దానిం గని యడలిపోయి పరుగెత్తు చుండఁగాఁ బ్రమాదవశమున నొక పాడునూతఁ బడి సువృత్త చెలికత్తె లతోఁ గూడ మరణించెను. ఈ దుర్వార్త శరవేగమున వచ్చి కొందరు వత్సునకుఁ దెలిపిరి. వత్సుఁడు వారిని బ్రదికింతు ననియు వారిశరీరములను జాగ్రత్తగాఁ గాపాడుచుండుఁ డనియుఁ దెల్పి యా వార్త దెచ్చినవారిని బంపి తాను సహ్యజ కేఁగి యందు కంఠముదాఁక నీటిలో నిలఁబడి యేకాగ్రతతో మృత్యుదేవతనుగూర్చి జప మొనరించుచుండెను.

ఇంతలో మదగజము పరుగుపరుగున వచ్చి యా మునిని సమీపించి తనతొండముతో నాతని నెత్తుకొని నెత్తి నిడుకొనెను. వత్సుఁ డద

లక తనమాఘస్నానపుణ్యము నా యేనుఁగుతొండమున ధారవోసెను. వెంటనే ఆ యేనుఁగు తనశరీరమును విడిచి దివ్యశరీరమున నాకాశమున కెగిరి తనపూర్వజన్మవృత్తాంత మాతని కెఱింగించి వెడలిపోయెను.

తనపట్టు విడువక వత్సుఁడు నీటిలోఁ దపము కొనసాగించుచు మృత్యుదేవత నిట్లు ప్రార్థించెను: "ఓసంజ్ఞాతనూభవ! క్రియాసాక్షి! ధర్మస్వరూపా? అధర్మశాస్తా! వైవస్వత! కరాళవదన! ప్రలంబోష్ఠ! దక్షిణదిఙ్నాథా! దండధారీ! మహిషవాహనా! దీప్తాగ్నినేత్రా! సాధుప్రసన్నా! అంజనపర్వతసంకాశా! అప్రమేయా! సంయమనీ పురీశ! శమనా! యమునా సహోదరా! నాకుఁ గన్పట్టుము." ఇట్లు ప్రార్థింపఁ ప్రార్థింప యముఁడు ప్రత్యక్షమై "వత్సా! నీ తపమునకు మెచ్చితి. నీ కేమి కావలయునో కోరుకొను" మనెను. వత్సుఁడు "దేవా! చని పోయిన సువృత్త చెలికత్తెలతోఁ గూడ తిరిగి జీవించునట్లనుగ్రహింపు" మని ప్రార్థించెను. యముఁ డట్లే యగు నని వర మిచ్చి యంతర్హితుఁ డయ్యెను.

వత్సుఁడు వెంటనే బయలుదేఱి సువృత్తాదుల శరీరము లున్న కడకు వచ్చి చేరెను. ఆతఁడు వచ్చుసరికి వారు లేచి కూర్చుండిరి. వారిబంధువు లెల్లరు చనిపోయినవారు తిరిగివచ్చుట వింతలకెల్ల వింత యని యపరిమితానంద మందిరి. అప్పు డాకన్యకలు తాము యమ లోకమున కేగి తిరిగి వచ్చుటఁ జెప్పి యమలోకమును సవిస్తరముగ వర్ణించి యెల్లరి కానందాశ్చర్యములఁ గలిగించిరి.

## మృగశృంగుని వివాహ వృత్తాంతము

పిదప, ఉతథ్యుఁడు మునీశ్వరుల నెల్లర నాహ్వానించి తనపుత్త్రి యగుసువృత్తను మృగశృంగమౌని కిచ్చి పరిణయము గావించు ప్రయత్నమున నుండఁగా, ఆమె చెలికత్తెలు ముప్వురునువచ్చి "మునీంద్రా! మేము ముప్వురమును నిన్నే భర్తగా భావించితిమి. మమ్మును నీవు పరిణయమాడ నీకు క్షేమము కలుగును. నీ వందు కంగీకరింపనియెడల మేము ప్రాణత్యాగము చేయుదు" మని మృగ శృంగునితో వాక్రుచ్చిరి.

వత్సుం డాశ్చర్యభయవిహ్వలుండై యేమిచేయుట యని డోలాందోళిత మానసుండై యుండ వ్యాసమహర్షి విచ్చేసి యందు దోషములేని దని నల్వురను వివాహమాడి సుఖింపుమని యాదేశించి సౌభరమహర్షి మాంధాతృచక్రవర్తి కూఁతుండ్ర నేఁబదిమందిని వివాహ మాడుట, చంద్రుఁ డిరువదియేడ్గురను పెండ్లిచేసికొనుటయు నుదాహ రించెను. వత్సుఁ డాతని పాదములకు మ్రొక్కి యానల్వురు కన్యకా మణులను వేదోక్తవిధిని వివాహమాడెను.

అనంతరము మృగశృంగుఁడు నలువురు భార్యలను దీసికొనిపోయి యాశ్రమము నిర్మించుకొని యందు వారితో గార్హస్థ్యధర్మము లాచ రించుచు వారితో నిష్టోప భోగము ననుభవించుచుండెను.

## మృగశృంగుని సంతానము

ఇట్లు కొంతకాల మగుసరికి మృగశృంగుని కృపవలన గర్భము ధరించి సువృత్త నవమాసములు నిండినపిదప నొక్కపుత్త్రుని గాంచెను. భూతభవిష్యద్వర్తమాన వేది యగు మృగశృంగుఁడు తపో నిష్ఠాగరిష్ఠుఁడై యుండు నా బాలుని దేహంబును మృగములు రాచుకొను ననెడియర్థము సూచితముగా నాతనికి మృకండుఁ డని నామకరణము చేసెను.

ఇదేవిధముగా మృగశృంగమహర్షి దయవలన కమల విమల, సురస యనుమిగిలినముగ్గురు పత్నులును గర్భములుదాల్చి కాలక్రమ మున ముగ్గురు సుతులను గాంచిరి. వారిలో కమలకు జనించిన కొమరుఁడు ఉత్తముఁ డనియు, విమలకు జనించిన పుత్రుఁడు సుమతి యనియు, సురసకుఁ గలిగినకొడుకు సువ్రతుఁడనియు నన్వర్థ నామ ధేయముల ధరించిరి.

కొంతకాల మైనపిదప యుక్తవయస్సు రాఁగానే మృకండుమౌని ముద్గలమహర్షికూఁతు రగు మరుద్వతిని పెండ్లాడి తపోగృహస్థజీవనము గడప నారంభించెను. ఉత్తముఁడు కణ్వముని పుత్రిక యగుకుశను,

సుమతి సుమతి యనుమునికూఁతురగు సత్యను, సువ్రతుఁడు పృథు పుత్త్రిక యగు, ప్రియంవదను బరిణయమాడి గృహస్థులైరి.

## మృగశృంగుఁడు మోక్షమందుట

మృగశృంగమహర్షి యట్లు పుత్త్రస్నుషా సహితుఁడై సకల సౌఖ్యము లనుభవించి మాఘమాసములం దుషఃస్నానములంజేయుచుఁ దపోవ్రతమును నడపెను. ఆ పిదప విరక్తి జనింప నాతఁ డెల్లరను విడిచి తపోవనమున కేఁగి సర్వభూతములను ఆత్మసామ్యమునం గనుచు మృగములతోఁ గలిసి నిర్భయముగఁ జరించుచుఁ బరమశాంతి యుతుఁడై కాలము గడపెను.

అంత్యకాలమున మృగశృంగమహర్షి ఆశ్రమమునఁ దనశరీర మును ద్యజించి బ్రహ్మపదమును గాంచి ప్రళయకాలము వఱకు సుఖ ముగా నుండి యా పిదప శ్వేతవరాహకల్పమున అజపుత్త్రుఁడుగ ఋభు వను పేర భూలోకమున జనించి నిదాఘుఁ డనువాని నుద్ధరించి తుదకు మోక్షసామ్రాజ్యమును జూఱగొనెను.

ఆ పిమ్మట మృకండుఁడు తనకు సంతానము కలుగని కారణమునఁ దల్లులతోడను భార్యతోడను బయలుదేఱి విశ్వేశ్వర రాజధాని యగు కాశీపట్టణమును జేరి గంగాస్నానాదికృత్యములను యథావిధిగ నొనర్చి డుంఠివిఘ్నేశ్వరునిముందుఁ దనపేర శివలింగమును బ్రతిష్ఠించెను. దానిముందు సువృత్త సువృత్తేశ్వరలింగమును, దానికిఁ దూర్పు దెసను కమల కమలేశ్వరలింగమును, విమల విమలేశ్వరలింగమును. సురస సురసేశ్వరలింగమును, మరుద్వతి మణికర్ణికకుఁ బడమటి దిక్కుగా మరుద్వతీశ్వరలింగమును బ్రతిష్ఠాపించిరి.

మృకండీశ్వరుని దర్శించుటవలన సర్వకార్యసిద్ధి, కాశీవాసమును; సువృత్తేశ్వరుని దర్శించుటవలన సద్వృత్తి, నిర్విఘ్నతయును; కమ లేశ్వరదర్శనమున సర్వకామసిద్ధియు; విమలేశ్వరదర్శనమున విమలజ్ఞాన ప్రాప్తియు; సురసేశ్వర దర్శనమున సురసామ్రాజ్యలాభమును కాశీ

మృతియు; మరుద్వతీశ్వర దర్శనమునఁ బునర్జన్మరాహిత్యము సిద్ధించును.

అట్లు కాశిని సేవించి మృకండుమాతలు వృద్ధ లగుటమణికర్ణికా తీర్థమున మాధ్యాహ్నికస్నానము లాచరించి శ్రీవిశ్వేశ్వరాలయమున కేగి ప్రదక్షిణము లొనర్చుచుఁ గన్నులు తిరుగ నేలపైఁ బడిపోయిరి. అపుడు విశ్వేశ్వరుఁడు వారికర్ణములఁ బ్రణవమంత్రమును జపింపఁగా వారు తనువులు వీడి కైలాసమునకేగిరి.

మృకండుఁడు మాతలకు శ్రద్ధాభక్తులతో నూర్ధ్వదైహికక్రియ లాచరించి తన భార్యతో నచ్చటనే యుండిపోయెను. అట నాతఁడు దినదినము గంగాస్నానము, విశ్వేశ్వరసేవ యొనరించుచుండ కాశీశున కాతనిపైఁ గరుణగలిగి వలసినవర మొక్కటి కోరుకొమ్మనెను. అతఁడు విశ్వేశ్వరునకు మ్రొక్కి యొక్క పుత్రు నిమ్మని ప్రార్థించెను. అంత శివుఁడు షోడశవర్షములు మాత్రమే బ్రదుకు సత్పుత్రుఁడు కావలయునా లేక చిరకాలజీవియగు దుష్పుత్రుఁడు కావలయునా యని యడిగెను. మృకండుఁ డప్పుడు షోడశసంవత్సరజీవి యైనను సత్పుత్రుఁడే కావ లయు నని కోరుకొనెను. విశ్వనాథుఁ డాతనికిఁ గోరిన వర మిచ్చి యదృశ్యుఁ డయ్యెను.

తరువాత మరుద్వతి మృకండుని కతమున గర్భముధరించి నవ మాసములు మోసి యొక్కపుత్రునిం గనియెను. ఇతఁడే మార్కండేయ మహర్షి. ఈతఁడు తరువాత మృత్యువును జయించి సర్వలోకారాధ్యుఁడు చిరంజీవి యయ్యెను. ఈ విధముగ జగద్విఖ్యాతి గాంచిన మార్కం డేయమహర్షి మృగశృంగమహర్షి పౌత్రుఁడు.

---

# మహర్షుల చరిత్రలు

## వ్యాఘ్రపాదమహర్షి

పూర్వము కృతయుగమున మహాతపశ్శాలియు, వేద వేదాంగ విదుఁడును, ధర్మప్రవచనదక్షుఁడు నగునొక మహాముని యుండెను. అతఁడు కామక్రోధమదమాత్సర్యాదు లనుజంతువులయెడ భయంకర వ్యాఘ్రమువలెఁ జరించువాఁడు. అందుచే నాతనికి వ్యాఘ్రుఁ డను పేరు కలిగెను. అంతేకాక, అతనిపాదములు వ్యాఘ్రపాదములవలె నుండుటచేత నాతఁడు వ్యాఘ్రపాదుఁ డనియుఁ బేరందెను.

### వి వా హ ము

వ్యాఘ్రపాదుఁడు యుక్తవయస్సు రాఁగానే తపశ్శూరుఁడు, అధ్యయనశీలుఁడు, శమదమాదిగుణాన్వితుఁడు నయి యొకమునికన్యకను వివాహమాడి గృహస్థధర్మములను నిర్వర్తింపఁ గడంగెను. గృహస్థాశ్రమమున నాతఁడు యజనయాజనాధ్యయనాధ్యాపనముల తోడను, అప్రతిగ్రహవ్రత పాలనముతోడను కాలము గడపుచుండెను.

### స ం తా న ము

ఇట్లుండ నాతని ధర్మపత్ని యాతనిదయకుఁ బాత్రురాలై తొలిచూలున ఉపమన్యు వను కుమారుని, మలిచూలున ధౌమ్యుఁ డనుకుమారుని గాంచి వారి నల్లారుముద్దుగాఁ బెంచుకొనుచుండెను. వారు బాల్యముననే తల్లి యనుమతిం గొని పరమేశ్వరుని గుఱించి ఘోరతప మొనరించి యాతనిం బ్రత్యక్షము చేసికొనిరి. పరమశివు కరుణ వడసి ఉపమన్యువు మహాజ్ఞాని మహాయోగి యయ్యెను. ధౌమ్యుఁడు మహర్షియై పాండవ పురోహితుఁ డయ్యెను.

## వ్యాఘ్రపాదుఁడు కాశీవిశ్వేశ్వరుని కరుణవడయుట

ఒకప్పుడు వ్యాఘ్రపాదుఁడు కాశికాపట్టణముఁ జేరి విశ్వేశ్వరుని సందర్శించి నిరుపమాన మగుభక్తితో నిట్లు స్తుతించెను:

" గంగాతరంగ కమనీయ జటాకలాపం
గౌరీ నిరంతర విభూషిత వామభాగమ్,
నారాయణప్రియ మనంగ మదాపహారం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్.

వాచామగోచర మమేయ గుణస్వరూపం
వాగీశవిష్ణు సురసేవిత పాదపీఠమ్,
వామేన విగ్రహవరేణ కళత్రవంతం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్.

రాగాదిదోషరహితం సుగుణానురాగం
వైరాగ్య శాంతినిలయం గిరిజా సహాయమ్,
మాధుర్యధైర్య నిలయం గరళాభిరామం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్.

తేజోమయం సకలనిష్కళ మద్వితీయం
ఆనందకంద మపరాజిత మప్రమేయమ్,
నానాత్మకం సగుణనిర్గుణ మాదిదేవం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్.

భూతాధిపం భుజగపుంగవ భూషితాంగం
వ్యాఘ్రాజినాంబరధరం జటిలం త్రినేత్రమ్,
పాశాంకుశాభయ వరప్రద శూలపాణిం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్.

ఆశాం విహాయ పరిహృత్య పరస్వనిందాం
పాపే రతిం చ వినివార్య మనస్సమాధౌ,
ఆధార హృత్కమలమధ్య గతం పరేశం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్.

శీతాంశుశోభిత కిరీట విరాజమానం
ఫాలేక్షణానల వినాశిత పంచబాణమ్,
నాగాధిపారచిత భాసుర కర్ణ పూరం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్.

పంచాననం దురితమత్తమతంగజానాం
నాగాంతకం దనుజపుంగవ పన్నగానామ్,
దావానలం మరణశోక భయాటవీనాం
వారాణసీపురపతిం భజ విశ్వనాథమ్."

[వారాణసీపురపతేః పరమేశ్వరస్య
వ్యాఘ్రోక్త మష్టక మిదం పఠతే మనుష్యః,
విద్యాశ్శ్రియం విపులసౌఖ్య మనంతకీర్తిం
సంప్రాప్య దేహవిలయే లభతే చ మోక్షమ్.]

వ్యాఘ్రపాదుని భక్తిభరితసంస్తవమున కలరి విశ్వేశ్వరుఁ డాత నికి సాక్షాత్కరించి కోరినవరము లొసంగి యనుగ్రహించెను.

## వ్యాఘ్రపాదస్మృతి

ఒకప్పుడు మహర్షు లనేకులు వ్యాఘ్రపాదుని కడకు విచ్చేసి వేద విదులలో నగ్రగణ్యుఁడు, హుతాగ్నిహోత్రుఁడు, సర్వశాస్త్రవిదుఁడు నగు నాతనిని "మునీంద్రా! సర్వలోకహితముఁ గోరి మాకు ధర్మ సంగ్రహమును వివరింపుము" అని కోరిరి. అందులకు వారి నభి నందించి "ఋషులారా! మీకు నేను యథాశక్తి సర్వముఁ దెలిపెదను. సావధానులై వినుఁడు" అని యిట్లు చెప్పఁదొడంగెను:

"ఏ యే యుగములం దే యే ధర్మములు చెప్పఁబడినవో వాని నన్ని టిని శ్రద్ధగాఁ బరిశీలింపవలయునే కాని యా ధర్మములను గాని యా ధర్మ ప్రవక్తలను గాని యెంతమాత్రము నిందింపరాదు. వైశ్వదేవ మొనర్పక భుజించు బ్రాహ్మణుఁడు కాకియై పుట్టును. బ్రహ్మచారి, గృహ స్థుఁడు, యతి, వానప్రస్థుఁడు - వీరికొఱకై నే నీ ధర్మశాస్త్రమును ప్రవ

చించెదను. ఎవఁడు బ్రాహ్మణుఁడై పుట్టి వేదవిద్య నాదరించి పఠింపఁడో వాఁ డాజీవితము శూద్రసముఁడే యగును. ఏబ్రాహ్మణుఁడు పితృప్రీతికై పిండదానము, తిలతర్పణము నొనరింపఁడో, వాఁడు శూద్రుఁడే యగును.

తూర్పుగాఁ దిరిగి కాని ఉత్తరముగాఁ దిరిగి కాని బ్రాహ్మణుఁ డాచమింపవలయును. పశ్చిమముగాఁ దిరిగి మరల నాచమించి దక్షిణముగాఁ దిరిగి స్నానము చేయవలయును. గోకర్ణకృతహస్తమున మాషమాత్రజలమునే అచమనమువేళఁ గైకొనవలయును. అంత కెక్కువైనను, దక్కువైనను ఆ జలము జలముకాదు: రుధిరసమ మగును. మిక్కిలి చల్లనివి, వేఁడివి, నురుఁగులతోఁ గూడినవి కాని జలమును బ్రాహ్మణుఁడు బ్రహ్మతీర్థముగా భావించి దృష్టిపూతముఁ గావించి యాచమింపవలయును. త్రాగఁగా మిగిలిన జలము, కాళ్ళు కడుగుకొనఁగా మిగిలిననీరు, వీని నాచమింపరాదు." శ్రాద్ధవిషయిక విధివిధానముల ననంతముగా నాతఁడు తెలిపెను. ఈధర్మము లన్నియు "వ్యాఘ్రపాద స్మృతి" యనఁ బరగుచున్నవి.

---

# మహర్షుల చరిత్రలు

## శుక్ర మహర్షి

### (ఉశనసుఁడు)

#### జననము

భృగుమహర్షి నవబ్రహ్మలలో నొకఁడై మహోత్తమ వంశమూల పురుషుఁడై ప్రఖ్యాతినందెను. ఆతఁడు కర్దమప్రజాపతి కూఁతు రగు ఖ్యాతి యనునామెను బెండ్లాడి ధాత, విధాత యను నిరువురుకుమారు లను శ్రీ యనుకూఁతును గనెను. ఆతఁడు పులోమ యనునామెను బెండ్లాడి చ్యవనమహర్షిని గాంచెను. ఉశన యను నామెను బెండ్లాడి యామె కొక కుమారుని బ్రసాదించెను. ఇతఁడే ఉశనసుఁడు. ఈతనికి శుక్రుఁ డనుపేరు తరువాత కలిగెను.

ఉశనసుఁడు బాల్యమునుండియు సర్వవిద్యలును సంపాదించి మహాతపస్సు చేసి "మృతసంజీవని" (చచ్చినవారిని బ్రదికించునది) అను గొప్పవిద్యను సంపాదించెను. ఈ లోకోత్తరశక్తివలన ఉశనసుఁడు మహావిఖ్యాతి నార్జించెను.

#### శుక్రుఁ డనుపేరు వచ్చినవిధము

ఉశనసుఁడు తపోబలముచేతను యోగబలముచేతను సర్వశక్తులు సంపాదించి విఱ్ఱవీఁగుచుండెను. ఒకప్పు డాతఁడు ధనార్థియై కుబేరుని కడ కేగి యాతని నవలీలగా మోసపుచ్చి యాతనిధననిక్షేపముల నపహరించెను. కుబేరుఁడు చేయునది లేక యీశ్వరునికడ కేగి యాతనితో మొఱపెట్టుకొనెను. తనభక్తునకు ద్రోహము చేసినభార్గవవంశజుఁ డగు ఉశనసునిపైఁ గోపించి యీశ్వరుఁడు శూలమెత్తి యా దుర్మార్గుఁ డెచట నున్నాఁ డని ప్రళయగర్జ చేసెను. అది విని ఉశనసుఁడు గడగడలాడి పోయి పోయిపోయి మాఱుమూలల సందుగొందుల తుప్పలలో దూఱి

యుండి యందు నక్కియున్నను దనకు శివకోపమునఁ జావు తప్పదని భయపడిపోయి శరవేగమున శివునికడకే చేరి యాతనిహస్తమునఁ బ్రవేశించెను. ఉగ్రమూర్తి యగుశివుఁడు ఉశనసునిఁ జూచి కోపముతో మ్రింగివేసెను. శివునికడుపులో నుండి యిటునటు తిరుగుచు బయటఁ బడఁ దలఁచిన ఉశనసుని తలంపెఱింగి శివుఁడు తనదేహరంధ్రముల నన్నిఁటిని మూసివైచి తనమూత్రమార్గమును మాత్రము మూయ కుండెను. ఉశనసుఁ డిఁక గతిలేక శివునిమూత్ర ద్వారమునుండి బయట పడెను. అప్పుడును శివుఁ డాతని నింకను శిక్షింప హుంకరించెను. ఉశనసునియదృష్టవశమునఁ జెంత నున్నపార్వతి "దేవా! ఈతఁ డెట్టి వాఁడైనను నీకడుపునఁ బుట్టుటచే నాకుఁ గొడుకైనాఁడు. ఈతనితప్పు లన్నిఁటిని మన్నించి దయదలఁచి యీతనిని సుఖవంతు నొనర్పు" మని ప్రార్థించెను. ఆ సుందరీలలామవదనారవిందముఁ గనుసరికి నామె మృదుమధుర శుకాలాపములు వినుసరికి శివుని కెక్కడికోప మక్కడకుఁ బోయెను. చిలుకలకొలుకు లగు కలుకులపలుకు లెవనికోపముఁ బాపలేవు?

శివుఁ డప్పుడు ఉశనసునికి గొప్పతేజస్సు నిచ్చి పార్వతితో నిట్లనెను. "దేవీ! వీని యోగము గొప్పది. నీ దయ యీతనిపైఁ గలిగినది. నీ దయ నా దయ. నీ కోపము నా కోపము. నీప్రీతి నాప్రీతి. ఈతఁడు శుక్రరూపమున బయటపడుటచే నిఁక నీతఁడు శుక్రుఁ డనుపేరఁ బరఁగును. ఉపరిమార్గమునుండి కాక అధోమార్గమునుండి వచ్చినవాఁ డగుట నీతఁడు సన్మార్గులకుఁగాక దుర్మార్గులగు రాక్షసులకు గురువయ్యెడు" నని పలికి ఉశనసుని విడిచిపుచ్చి కుబేరుని నిధులు కుబేరునికిఁ జేర్చెను.

"సజ్జనులవలనికోపమైనను క్షేమదాయకమే. దుర్జనులవలని ప్రేమయైనను బ్రమాదహేతువే" అన్నవాక్యము ఉశనసునిపట్ల ధ్రువ మయ్యెను.*

## రాక్షసగురుత్వము

కాలక్రమమున రాక్షసరాజు లెల్లరు విచ్చేసి తమకులగురువై తమ క్షేమము నరయుచుండు మని ఉశనసునిఁ బరిపరివిధములఁ బ్రార్థించిరి.

---

* భారతము; శాంతిపర్వము.

ఎట్టకేలకు, తాను దేవగురువు కాఁదలఁచియు దేవతలు తన్నుఁగాక బృహస్పతిని గురువుగా వరించియున్న కోపముకతమున, ఉశనసుఁడు రాక్షసలోకగురువుగా నుండ నంగీకరించెను. నాఁటినుండి యాతఁడు శుక్రాచార్యుఁ డని యెల్లరచేఁ బిలువఁ బడుచుండెను. అసలుపేరు మూలఁబడి యీపేరే ఆతనికి శాశ్వత మయ్యెను.

## శుక్రుఁడు అసురులను శపించుట

శుక్రాచార్యుని గురుత్వమహత్త్వమున హిరణ్యకశిపుఁడు డెబ్బది రెండు నియుతంబుల రెం డర్బుదంబుల యెనుబదివేల సంవత్సరములు (726160000) మూఁడులోకములను ఏకచ్ఛత్రాధిపతియై తన్నుఁ గాదనఁ గలుగువాఁడు లేక పరిపాలించెను.

తరువాతఁ జిరకాలమునకు రాక్షసులను విడిచి యజ్ఞపురుషుఁడు దేవతలకడకుఁ బోయెను. నాఁటినుండి దేవతలకు విజయము, శుభము, సౌఖ్యము పరంపరలుగాఁ గలుగుచుండెను. రాక్షసులకు పరాజయము, అశుభము, అసౌఖ్యము అవిచ్ఛిన్నముగాఁ గలుగుచువచ్చెను. మూఁడు లోకములందును పరాజయ మందిన రాక్షసులు తమకులగురు వగు శుక్రాచార్యునిఁ జేరి తమకష్టనష్టములు తెలుపుకొని రక్షింపఁ బ్రార్థించిరి. శుక్రాచార్యుఁడు వారి కభయమిచ్చి శౌరిసాయమున దేవతలు జయించుచుండి రనియుఁ దాను శివునిసాయము సంపాదించి యాతనివరముల మహత్త్వమున రాక్షసులు మరల మూఁడులోకములు నేలునట్లు చేయఁ గలనని శపథముచేసి వారిని పంపివేసెను. వెంటనే తనమాటప్రకారము శుక్రుఁడు కైలాసపర్వతమున కేగి పరమశివుని భజించి "దేవదేవా! దేవతల పరాజయమునకు రాక్షసుల విజయమునకు బృహస్పతి యెఱుంగనిమంత్రరహస్యములను నాకు బోధింపు" మని ప్రార్థించెను. "భార్గవా! నీవు తలక్రిందులుగ కణధూమపానముచేయుచు వేయిసంవత్సరములు తపస్సుచేసినయెడల నీకోరిక సిద్ధించు" నని చెప్పి పొమ్మనెను.

పరమశివునియనుగ్రహ మట్లు పొంది యాతఁడు చెప్పిన చొప్పున శుక్రాచార్యుఁడు తదేకనిష్ఠాగరిష్ఠుఁడై "కణధూమవ్రత" మను గొప్ప వ్రతము నవలంబించి తలక్రిందులుగాఁ దపసుచేయ నారంభించెను.

ఇట్లుండ దేవతలు విజృంభించి యొక్కపెట్టున రాక్షసుల నుక్కడఁగింపఁ దొడంగ వారు గతి లేక శుక్రాచార్యుఁడు లేమి విచారించి యాతని తల్లియు భృగుపత్నియు నగు ఉశనకడ కేగి మొఱవెట్టుకొనిరి. ఆమె వారి కభయ మిచ్చి యాదరించెను. ఈ సంగతి విని యింద్రుఁడు దేవతలతో నామెపైకి యుద్ధమునకు వచ్చెను. ఉశన వెంటనే యోగ బలమున నిద్రాదేవత నింద్రునిపైకిఁ బంపెను. ఆ కారణమున నింద్రుఁడు మోహబద్ధుఁడై కదలలేక మెదల లేక కునికిపాటులు పడుచుఁ గూర్చుండి పోయెను. దేవత లెంత యత్నించిన నాతనికి తెలివి కలుగకుండెను. అపుడు దేవతలంద ఱాలోచించి పరుగుపరుగునఁబోయి హరిని శరణుఁ జొచ్చి జరిగినసంగతి విన్నవించి కాపాడు మని ప్రార్థించిరి. హరి వారి కభయమిచ్చి వారివెంట భృగుపత్నికడ కేగి యచటఁ బడియున్న యింద్రునిఁ దనలోఁ బ్రవేశింపు మనఁగా నాతఁ డాహరియందుఁజేరి తెలివంది శుక్రమాతతో యుద్ధమునకుఁ దలపడెను. శుక్రమాతయు, భృగుపత్నియు నగు ఉశనాదేవి కన్నుల నిప్పులు గ్రక్కుచు "ఓరీ! ఇంద్రా!

"అగణితమాహాత్మ్యం డగు
భృగుమౌనికి నేను బత్ని నెవ్వనిలో గ్రము
చ్చుగ నీవు చొచ్చితివో యా
భగవంతుని నిన్నుఁ గూడ భస్మ మొనర్తున్."

అని యా మహాసాధ్వి పలికినవెంటనే ప్రమాద మాశంకించి విష్ణువు తన చక్రమున నామెతల నఱికెను. భృగుపత్ని శిరము వెంటనే నేలఁబడెను. ఇంద్రుఁడు ఉపేంద్రుఁడు వెడలిపోయిరి.

ఆ సమయముననే భృగుమహర్షి యాశ్రమమునకు వచ్చెను. రాఁగానే యాతనికి నేలపైఁ దలతెగి పడియున్నపత్ని గోచరించెను. దివ్యదృష్టి పాఱించి సంగతియంతయుఁ దెలిసికొని తోకత్రొక్కినత్రాచు వలె లేచి "ధర్మ మెఱిఁగియుఁ దరుణిని జంపినదోషమునకు విష్ణువు భూమిపై నేడుమారులు నరుఁడై పుట్టుఁగాక" యని శపించి భృగు మహర్షి భార్య తలతీసి మొండెముకడ నుంచి యతికి "నేను ధర్మస్థిరు

డనే యైనచో నాపత్ని తత్క్షణమే బ్రదుకుఁగాక!" యని పలికినంతనే దివ్యసాధ్వియై యా మహాసాధ్వి లేచి నిలిచి భర్తకు మ్రొక్కెను.

ఈ సంగతి తెలిసి యింద్రుఁడు భయపడిపోయి శుక్రాచార్యుఁడు తపమున శివుని మెప్పించి వచ్చినచో నింకను గొంపమునుఁగు నని యెంచి యాతనితపోభంగ మొనరింప నిశ్చయించెను. చక్కని చుక్కయు, సర్వశుభలక్షణయు నగు జయంతి యను తనకూఁతును బిలిచి శుక్రాచార్యుని కుపచారములు చేసి యెట్లైన నాతనిని వలలో వేసికొ మ్మని నియోగించెను.

జయంతి తండ్రియాజ్ఞ నౌదలధరించి పోయి శుక్రాచార్యునికిఁ బరిచర్యలు చేయుచుండెను. అతఁడు కోరకున్నను దనపాణిపద్మము లచే నాతని పదపద్మము లొత్తుచుండెను. తపోగ్ని మధ్యమున ముచ్చె మటలు పోసినపు డాతనిస్వేద మామె తనమనోహర చీనిచీనాంబరముచేఁ దుడుచుచుండెను. అతఁడు కనువిప్పినవేళఁ దనకడకంటి చూడ్కు లాతనిపై గ్రుమ్మరించెడిది. అగ్నిహోత్రము కూర్చుచు, పూలు కోసి కొని వచ్చియిచ్చుచు, పైఁటకొంగుతో విసరుచు, ఆ యిందువదన మంద గమనముఁ జూపుచు నాతని వశపఱచుకొనునెడరు వేచియుండెను. కాని, వ్రతనిష్ఠాగరిష్ఠుఁడై యాతఁడు వేయిసంవత్సరములు నచంచలుఁడై గడపెను.

శుక్రునిమహానిష్ఠకు సంతసించి శివుఁడు ప్రత్యక్షమై "భార్గవా! ఇంతవఱకు ఈ 'కణధూమవ్రత' మాచరించి తుదనెగ్గిన వాఁ డెవ్వఁడును లేఁడు. నీ విందు నెగ్గుటచే నీకోరినకోరిక తీరుటయే కాక నిన్ను జయించు వాఁడే యెవఁడు నుండఁడు. ధనము, ప్రజ, విజయము, నిన్ను వరింప నీవు మహానుభావుఁడ వయ్యెద" వని వరము లిచ్చి యదృశ్యుఁ డయ్యెను.

పిదప శుక్రాచార్యుఁడు తనకు నిరుపమాన మగు సేవ యొనరించిన జయంతిని ముద్దులుమూటగట్టునవయౌవనవిరాజితను గాంచి "తరుణీ! నీ వేకోరికఁ గోరి న న్నర్చించితివో నీ కా కోరిక సిద్ధింపఁజేసెదను. చెప్పు"

మని యడిగెను. "దేవా! నిన్ను భర్తగ వరించి యీసేవలు చేసితిని. పదివేలసంవత్సరములు నీవు నాతో సుఖించువర" మిమ్మని ప్రార్థించెను. శుక్రుఁ డందుల కంగీకరించి యామెకొక మనోహరకేళిగృహము నిర్మించి యొరు లెవ్వరికిని గానరానివిధమున నామెతోఁ గామసుఖము లనుభ వించుచుఁ బదివేలసంవత్సరము లుండిపోయెను.

ఈలోఁగా శుక్రుఁ డెంతటికిని దిరిగిరాకపోవుటకుఁ గారణ మెఱుం గక రాక్షసు లందఱు ధైర్యహీనులై తేజోహీనులగుచుండిరి. వారి నింకను జెఱుప నిదే సమయమని యెంచి బృహస్పతి శుక్రవేషమును ధరించి రాక్షసులకడకు వచ్చిచేరెను. అతఁడు నిజముగఁ దమగురువే యనుకొని రాక్షసు లపరిమితానందమున నాతనిని స్వీకరించి కులగురు వుగాఁ బూజించుచుండఁగా వేయిసంవత్సరములు గడచెను. అప్పటికి శుక్రుఁడు జయంతికిఁ గామసంతృప్తి పరిపూర్ణముగా నొసంగి యామెవలన నలువురుకుమారులను, ఒక కొమార్తెను గాంచెను. చండుఁడు, అమర్కుఁడు, త్వష్ట, ధరాత్రుఁడు అనునలువురుకొడుకులను, దేవయాని యనుకూఁతును దీసికొని జయంతిని బంపివేసి శుక్రుఁడు రాక్షసనగరమునకు విచ్చేసి తనయాగమనవార్త శిష్యులకుఁ దెలిపెను. ఎవ్వరును వచ్చి యాతనిని గౌరవింపరైరి. ఇదేమని యాతఁడు రాక్షస సభ కేగి చూడ నచట శుక్రవేషమున నున్నబృహస్పతి కనిపించెను. శుక్రుఁ డాతనిమోసమును గ్రహించి కోపముతో "ఓరీ! నేను లేని సమయముఁ గనిపెట్టి నా శిష్యుల నిటులు మోసగింతువా? వారు నిన్ను గుర్తెఱిఁగినతక్షణము నిన్నుఁ జీలికలు వాలికలు చేయుదురు. ఆసనము దిగి వెంటనే పొ"మ్మని హుంకరించెను. బృహస్పతి యాతనిం జూచి "ఓరీ! ఇదివఱకు ధనతస్కరులనే మే మెఱుఁగుదుము కాని రూపతస్క రుల నెఱుంగము. ఇపుడు నిన్నుఁ జూచితిమి. చాలు. నిన్ను నమ్ము వా రెవరును లేరు. పో"మ్మని చెప్పెను. అపుడు నిజమైనశుక్రుఁడు రాక్షసుల నుద్దేశించి జరిగినమోస మంతయు వివరించి చెప్పెను. కాని వా రందఱు దొంగశుక్రుని నిజమైనశుక్రునిగాఁ దలఁచినవా రగుట నీతని మాటలను బాటింపరైరి. అంతేకాదు. బృహస్పతిమాటలను బట్టి యాతని మెడపట్టి గెంటివేసిరి.

ఇట్లు శుక్రాచార్యుఁడు నిజశిష్యులచేతనే ఘోరావమానమునకుఁ బాల్పడి రాక్షసవంశములు నాశనము లగుఁగాక యని శపించి తనబిడ్డ లతోఁ దపోవనమునకు వెడలిపోయెను. "పిల్లి శాపమునకు ఉట్లు తెగి క్రిందఁ బడునా? దొంగవాఁడు కపట నాటకమాడి మనలను శపించిన, ఆ శాపము మనకు సోఁకునా?'' యని బృహస్పతి రాక్షసులకు నమ్మఁ బలికి వారిని విజయవంతముగా మోసగించెను.

రాక్షసులకు వైదికమతవిశ్వాసముఁ బోఁగొట్టినఁగాని వారు శాశ్వత ముగా నాశము కా రని యెంచి యిదే యదను నని బృహస్పతి రాక్షసు లందఱఁ బిలిచి వేదబాహ్య మగు ఆర్హత మతమును వారికిఁ జక్కఁగా బోధించి వారి కది బాగుగా నొంటఁబట్టినపిమ్మట వారి నంద అను యమునాతీరమునకుఁ గొనిపోయి స్నాతులఁ జేయించి ఆర్హమత వేషముల ధరింపఁజేసి "అర్హతాయ నమో" అన్న మంత్ర ముపదేశించి వారిని వేదబాహ్యులను. కర్మభ్రష్టులను పరిపూర్ణముగా నొనరించి రహ స్యముగా దేవలోకమునకుఁ బోయెను. దేవతలు వెంటనే యుద్ధము ప్రకటించి రాక్షసులను ముప్పతిప్పలఁబెట్టి మూఁడుచెఱువులనీళ్ళు త్రాగించి తుక్కుతుక్కుగ నుక్కడఁగించిరి. అప్పటికి వారికి జరిగిన మోస మంతయుఁ దెలియవచ్చెను. చేతులు కాలినపిదప నాకులు పట్టిన నేమిలాభము?

రాక్షసు లందఱును శుక్రాచార్యుని వెదకికొనుచుఁ బోయిపోయి తుద కాతనిఁ గాంచి పాదములఁ బడి తమ్ము క్షమించి పురికి విచ్చేయు మని ప్రార్థించిరి. ఆతఁడు వారిని గంటనైనఁ గనక, మాటయైన మాటాడక గర్హించి పొమ్మఁదోలెను. "ఉభయ భ్రష్టత్వ, ఉపరి సన్న్యాస సము" అన్ననానుడి రాక్షసులకుఁ బూర్తిగా వర్తించెను. అపుడు వారు గోలుగోలున నేడ్చుచుఁ దాము పడ్డ మోసమునకుఁ జేసినమోసమునకు లెంపలు వైచుకొని పశ్చాత్తాపపడి ప్రహ్లాదునికడ కేగి రక్షింపుమని యాతనిపాదములపైఁ బడిరి. దయార్ద్రహృదయుఁ డగు నా మహాను భావుఁడు రాక్షసపురస్కృతుఁడై శుక్రాచార్యులపాలి కేగి రాక్షసకుల మొనరించిన మహాపరాధమును మన్నించి కాపాడు మనియు, బృహస్పతి

పన్నినకుట్రచే నిజము తెలిసికొనలేకపోయిరే కాని గురుద్రోహబుద్ధికాని గురుగౌరవరాహిత్యముకాని రాక్షసుల కెంతమాత్రము లేదనియు, తన్నుఁజూచియైన వారిని క్షమించి కాపాడుమని పదేపదే ప్రార్థించెను. రాక్షసలోకమంతయు వచ్చి శుక్రునిట్రమోల సాష్టాంగపడెను. సహజ దయార్ద్రహృదయుఁ డగు శుక్రాచార్యుని కప్పటికి వారిపై జాలికలిగి నిజ శివతపశ్చర్యావృత్తాంతము, వరగ్రహణము వారికి సవివరముగాఁ దెలిపి ప్రహ్లాదునిమనుమఁడు, సకలగుణసంపన్నుఁడు, బలవిద్యాతేజ స్వంతుఁడు, భక్తిసంపన్నుఁడు నగు బలిని వారికి నాయకు నొనరించి యాతనిచే ముల్లోకములు మరల నేలింతు నని చేసిన ప్రతిజ్ఞ మరలఁ జేసి తాను గడించినమంత్రరహస్యములను బలికి మిగిలినరాక్షస నాయ కులకుఁ దెలిపెను.

శుక్రాచార్యుని కారణమున రాక్షసు లందఱు మహావీర్యవంతులై యుద్ధసన్నద్ధులై బలియాజమాన్యమున నవలీలగా ముల్లోకములను జయించిరి. వెంటనే శుక్రుఁడు బలిని చక్రవర్తి నొనరించి యింద్రాది దేవతలను బృహస్పతిని బాఱఁదోలించి పరిభవించి యిరువది నియుత ముల యొక యర్బుదము నఱువదివేల సంవత్సరములు (20,:0,64,0000 ఆతనిచే రాజ్య మేలించెను.*

## శుక్రునికూఁతురు దేవయానివృత్తాంతము

వృషపర్వుఁ డనురాక్షసరాజు ఆచార్యుఁ డగుశుక్రుని మహాభక్తి గౌరవములతో భజించుచు, నాతనిం దనపురమున రాజప్రాసాదమునఁ బెట్టుకొని యాతనిఁ దనకంటె నెక్కుడుగాఁ బూజించుకొనుచుండెను ఇంత వినయవిధేయతలఁ జూపుశిష్యునిపట్ల గురువగు శుక్రాచార్యుఁడు నతిదయాపరుఁడై యాతనితలలో నాలుకవలె మెలఁగుచుండెను. వృషపర్వుఁడు మహాయుద్ధముల నొనరించి దేవతల నేడ్పించుచుండెను యుద్ధములో మృతులైనరాక్షసుల నెల్లరను మృతసంజీవనీవిద్యచే గురువు బ్రదికించుచుండుటచే రాక్షసుల జయింప దేవతలకు సాధ్యము కాదయ్యెను.

* పద్మపురాణము, సృష్టిఖండము, బ్రహ్మాండ పురాణము

అప్పుడు దేవత లందఱు నాలోచించి యెట్టైన శుక్రాచార్యునివలన మృతసంజీవనీవిద్య గ్రహించి తేఁగలవాఁ డెవఁ డని యాలోచించి బృహస్పతిపుత్రుఁ డగు కచుఁడుదక్క నన్యుల కది సాధ్యము కాదని గ్రహించి యాతని నందులకై ప్రార్థించిరి.

దేవహితార్థియై కచుఁడు బయలుదేఱి వృషపర్వునినగరుచేరి యందు వేదాధ్యయనశీలుఁడై సకలదైత్యదానవగణోపాధ్యాయుఁ డయి యున్నశుక్రాచార్యునిం గని సాష్టాంగనమస్కార మొనరించి "ఆచార్యా! నేను బృహస్పతిపుత్త్రుఁడను, నన్నుఁ గచుఁడందురు. నేను నీకడ శిష్యుఁడనై యుండి విద్యలు నేర్వ వచ్చితిని. నీవు నన్నను గ్రహింపు" మని ప్రార్థించెను. బాలుఁడయ్యును నియమవ్రతశీలుఁడైన వాఁడు, సుకుమారుఁడు, ప్రకాశవంతుఁడు, ప్రశాంతుఁడు, విశేషించి బృహస్పతియంతవాని పుత్రుఁడు వచ్చి శిష్యత్వ మంగీకరింపుమని ప్రార్థించిన నంగీకరింపకుండు టెట్లని శుక్రుఁడు పరమప్రీతి నాతని నాదరించి యభ్యాగతపూజ లొనరించి యాత్మశిష్యు నొనర్చుకొనెను.

అది మొదలు శుక్రాచార్యుఁ డేపని చెప్పినను వెంటనే చేయుచు మనోవాక్కాయకర్మలచే గురుసేవ చేసి యాతనిమనస్సును, అంతకన్న మిన్నగా నాతనికన్నకూఁతురగు దేవయాని సున్నితహృదయమును కచుఁ డపహరింపఁ గలిగెను. కచుఁడు దేవయాని గీచినగీఁతదాటఁడు. ఆతఁడామెను హితమిత భాషణములచేతను, పుష్పఫలాదిదానములచేతను, నిరంతరము సంతోషపెట్టుచుండెను. ఇట్లు కొన్ని సంవత్సరములు జరిగెను. గురుశుశ్రూషాకౌశలమునఁ గచుఁడు గురునకుఁ బ్రియశిష్యుఁడు. గురుతనూజకుఁ బ్రియమిత్రుఁడు నయ్యెను.

ఇది చూచి రాక్షసులు సహింపలేరైరి. అందుచే నొకనాఁడు వనములో హోమధేనువులంగాచు కచుని బట్టుకొని చంపి రాక్షసులు వాని శవము నొకచెట్టునకుఁ గట్టిపోయిరి. నాఁడు చీఁకటి పడుసరికి అవు లింటికి వచ్చినవి కాని, కచుఁడు రాఁడయ్యెను. కచుఁ డన్నఁ బంచ ప్రాణములుగా నున్న దేవయాని యాతనికొఱ కేడ్చుచుఁ దండ్రితో మొఱ పెట్టుకొనెను. శుక్రాచార్యుఁడు దివ్యదృష్టిని జూచి జరిగినదెల్ల గ్రహించి

యాతనిం బ్రదికించి తీసికొనిరమ్మని తన మృతసంజీవనీవిద్యం బంపెను. మహాప్రసాద మని యా విద్య శరవేగమున నేగి కచుని సంజీవితు నొనర్చి తీసికొని వచ్చెను. తండ్రికూఁతు లిరువురు నాతనింజూచి సంతోషించిరి.

ఈ సంగతి నెఱింగిన రాక్షసు లీసారి యట్లు కాదని యడవికిఁ బువ్వుల కరిగినకచునిఁ బట్టుకొని చంపి కాల్చి బూడిదచేసి యా బూడిద కల్లులోఁ గలిపి యా కల్లు తెలుపకుండ శుక్రునిచేఁ ద్రాగించిరి. సురాపానమోహితుఁడగు శుక్రాచార్యుఁ డేమియు నెఱుఁగఁ డయ్యెను. దేవయాని కచునిం గానక వెక్కివెక్కి యేడ్వఁదొడంగెను. "ఓసీ! ఏల యేడ్చెదవు? ఇంక నెన్నిసారులు బ్రదికించినను రాక్షసు లాతనినిఁ జంపక మానరు. అతఁడు సుగతికే పోయియుండును. ఇఁక నతని కొఱ కేడ్వకు" మని శుక్రాచార్యుఁడు దేవయానితో ననెను. అంత దేవయాని కన్నులనీరు వఱదలై చన్నులవెంటఁ బ్రవహింప:

"మతిలోకోత్తరుఁ డైనయంగిరసునమ్మం డాశ్రితుం డా బృహ
స్పతికిం బుత్రుఁడు మీకు శిష్యుఁడు సురూపబ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ డకారణంబ దనుజవ్యాపాదితుండైన న
చ్యుతధర్మజ్ఞ! మహాత్మ! య క్కచున కే శోకింప కెట్లుండుదున్?

భార. అది. ౩. ౧,౧,౮.

వానినిఁ జూచి కాని నే భుజింప; నిద్రింప; జీవింప" నని యేడ్చెను. శుక్రాచార్యుఁడు కొంతసేపటికిఁ గూఁతుమీఁదిపైఁగల మమత్వము, అనుంగు శిష్యునిపైఁ గలవాత్సల్యము స్మరించి దివ్యదృష్టి సారించి లోకాలోక పర్వతపర్యంతభువనాంతరమున నెక్కడను గచుని గానఁ డయ్యెను. తుదకు బూడిదయై సురతోఁ గలిసి తన కడుపుననే యున్నకచుఁ డాత నికి గోచరించెను. సురాపాన దోషము, అసురాపకారావమానము హృదయమును దహింప శుక్రాచార్యుఁ డిట్లు తలపోసెను. "అయ్యో! ఎన్నిజన్మములందో యెంతో శ్రమపడి సంపాదించినపుణ్య మంతయు నొక్క క్షణములో సురాపానదోషమునఁ బోవుటేకాక మహాపాపము పైఁబడుఁగదా! ఇట్టిదోషభూయిష్ఠ మైనసురాపానము బ్రాహ్మణులకు

క్షంతవ్యమగునా? సర్వరాక్షసలోకగురుఁడను; సర్వవిద్యా వివేకకోవిదుఁడను, నేనే యీ దోషమున నింత యవివేకముగా మోసపోతినే? ఇఁకఁ బ్రపంచముగతి యేమి?'' ఇట్లు తలపోసి శుక్రాచార్యుఁడు సురాపానము మహాపాప మనియు విశేషించి విప్రుల కది సర్వవినాశహేతు వనియు శపించెను.

శుక్రుఁడు విద్యావినయవివేకసంపన్నుఁడు, విశేషించి ప్రియ శిష్యుఁడు నగుకచుని బ్రదికింప కెట్లుందు ననుకొని యాతనిం దనసంజీవనీ మంత్రముచేఁ గడుపులోనే బ్రదికించెను. కచుఁడు కడుపులోనుండి "జయ గురుదేవా! కృతజ్ఞుఁడను. నీ దయవలన శరీరము, ప్రాణము, బలమును పొందితిని. బయటపడు నుపాయముఁజెప్పి రక్షింపవే" యని మిక్కిలిప్రార్థించెను. అందులకు శుక్రాచార్యుఁ డిట్లనెను. "వత్సా! నా కడుపు బ్రద్దలైనఁగాని నీవు బయటపడలేవు. నా కడుపు బ్రద్దలైనచో నేను చనిపోవుదును. నన్ను బ్రదికించు విద్య మృతసంజీవని నీకు బోధింపవలయును. నే నట్లు చేసినచో నీ వచ్చినపనియై దేవతలకు మేలగును. నా శిష్యులగు రాక్షసులకుఁ గీడగును. ఐనఁ గానిమ్ము. విద్యావినయవివేకములు, శ్రద్ధాభయభక్తులుగలిగి, గురుశుశ్రూషాపరాయణులు, లోకోపకారకులు, నియమవ్రతశీలురునగు ఆత్మీయప్రియ శిష్యులకుఁ బరమరహస్య విద్యయైనను బోధింపక దాచుకొనుగురువు గురువు కాఁడు, నిరయవాసి యగును. కావున, ఏదియేమైనను నీకీ విద్య బోధించెదను. నీవు నాకడుపు వ్రక్కలుచేసికొనివచ్చి చచ్చిన నన్ను బ్రదికింపుము."

ఇట్లు పలికి శుక్రాచార్యుఁడు లోకోత్తర మగుసంజీవనీ విద్యను లోకోత్తరుఁడగు కచునకు లోకోత్తరపద్ధతిని బ్రసాదింపఁగనే కచుఁడు గురునికడుపు బ్రద్దలు చేసికొని బయటికివచ్చి వెనువెంటనే తాను నేర్చిన విద్యచే విగతజీవుఁడై పడియున్నవేదమూర్తిని బ్రదికించెను. ఆ గురు శిష్యులను సర్వదేవతలు నభినందించి పుష్పవృష్టి వారిపైఁ గురియించిరి. దేవయానియానందమునకుఁ బట్టపగ్గములు లేకుండెను.

ఇట్లు శుక్రాచార్యుఁడు సమస్తము నెఱింగియు శిష్యరత్నమగు కచునకుఁ దనకు ప్రాణప్రదమగువిద్యను బోధించి తన యుదారతను,

నిష్కలుషతను, విద్యావిషయమున శత్రుమిత్రభేదభావ రాహిత్యమును జూపి లోకోత్తరపురుషుఁ డయ్యెను.*

## శుక్రాచార్యుఁడు యయాతిని శపించుట

కచుఁడు దేవలోకమున కేగ తన్ననుమతింపు మని కోరఁగా దేవయాని తన్నుఁ బెండ్లాడు మని కోరెను. కచుఁడు ధర్మరహిత మని దాని కంగీకరింపకపోఁగాఁ దనతండ్రివలన గ్రహించిన మృతసంజీవని కచునకుఁ బనిచేయఁకుండుఁగాక యని యామె శపించెను. "నాకది పని చేయకపోయినను నావలన గ్రహించినవారికది పనిచేయుఁగాక! నన్ను కారణముగ శపించితివి కావున నిన్ను బ్రాహ్మణుండు వివాహమాడకుండుఁ గాక" యని కచుఁడు ప్రతిశాపమిచ్చి వెడలిపోయెను.

వృషపర్వునికూఁతురగుశర్మిష్ఠ తన వేయి మందిచెలికత్తెలతో దేవయానితో వనవిహారమున కేగి యందు దేవయానితో మాట పట్టింపు వచ్చి దేవయానిని బాదునూఁతం ద్రోయించి చెలికత్తెలతో నింటికివచ్చి చేరెను. యయాతిమహారాజు వేఁటకువచ్చి దస్పి దప్పికచెంది దైవికముగా ఆ నూఁతికడకువచ్చి జలములు తీయ లోనికిఁజూడ నాతనికి సర్వాంగ సౌందర్యవతి, యువతి యగుదేవయాని పడియుండి కనిపించెను. యయాతి యామెను బలుకరించి యాయమచరిత్ర లడిగి తెలిసికొని తన కుడిచేతితో నామెను బట్టుకొని నూఁతినుండి బయటికిఁదీసి యోదార్చి వెడలిపోయెను. దుర్మార్గురాలైనశర్మిష్ఠఁ గన్నతండ్రినగరము చూడ నని దెవయాని యటనే యుండి తండ్రికి వార్తపంపెను. శుక్రుఁడు వెంటనే కూఁతు రున్నచోటుచేరి యామెవలన జరిగినసంగతి యంతయు విని "తల్లీ!

అనుపమనియమాన్వితులై
అనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు చే
సినవారికంటె అక్రో
ధనుఁడ కరం బధికుఁ డండ్రు తత్త్వవిధిజ్ఞుల్.

---

* భారతము ఆదిపర్వము.

అలిగిన నలుగక యెగ్గులు
పలికిన మఱి విననియట్లు ప్రతివచనంబుల్
పలుకక బన్నమువడి యెడఁ
దలఁపక యున్నతఁడ చూవె ధర్మజ్ఞుఁ డిలన్.

భార. ఆది. ౧౪౬. ౧౪౭

కావున, బుద్ధిహీనులే కాని బుద్ధిమంతులు ఎవరిమీఁదను గోపింపరు. ఇంతకు శర్మిష్ఠ రాజుకూఁతురు. చిన్నపిల్ల. దాని తెలివితక్కువ తనముఁ జూచి జాలిపడవలయునే కాని కోపింపఁ జనదు'' అని బోధించెను. కాని, దేవయాని వినక "తండ్రీ!

కడు నసురక్ష్త్రీయు నేర్పను
గడఁకయుఁ గలవారి నుఱక కడవఁగ నెగ్గుల్
నొడివెడి వివేకశూన్యుల
కడ నుండెడు నంతకంటెఁ గష్టము గలదే.

(భార. ఆది. ౩. ౧౪౮.)

నేనేమైన నా నగరు త్రొక్క'' నని భీష్మించి యుండ శుక్రాచార్యుఁడు నటనే నిలిచిపోయెను. ఈ సంగతి యంతయుఁ జారులవలన విని వృషపర్వమహారాజు త్వరితగతి వచ్చి తండ్రికూఁతుళ్ళ కెఱఁగి "ఆచార్య! నీవలననే రాక్షసకుల ముద్ధరింపఁ బడినది. నీ ఋణము మే మెట్లును దీర్చుకొనలేము. మా సమస్తైశ్వర్యములు, పుత్రమిత్ర పరివారము, ధనధాన్యసంపదలు అన్నియు నీవే. నీ వెట్లు చెప్పిన నట్లు నడచుకొందుము. దేవయాని యేమి చేయుమన్న నది చేయు దును క్షమింపు'' మని ప్రార్థించెను.

అట్లైన "నీకూఁతును వేయుమందికన్యకలతో నాపాద దాసి నొనర్పు" మని దేవయాని వృషపర్వుని గోరెను. అతఁడు మహా ప్రసాద మని యట్లే యొనరించెను. శర్మిష్ఠయుఁ దనతప్పిదము నెఱింగి క్షమింపఁ బ్రార్థించి తండ్రియానతి తలధరించి దేవయానికి వేయి మంది కన్యలతో సేవచేయుచుండెను.

ఒకనాఁడు శర్మిష్ఠయు నామె పరివారమును దన్ను సేవించు చుండ దేవయాని వనవిహారమున కేగెను. దైవికముగా నచట యయాతిమహారాజు తటస్థపడెను. అతఁడు దేవయానిం బలుకరించి మిగిలినవారంద ఱెవ్వ రని యడిగెను. దేవయాని సమస్తము నాతనికిఁ జెప్పి తన్నుఁ బెండ్లాడు మని ప్రార్థించెను. అంత యయాతి క్షత్త్రియుఁడు బ్రాహ్మణకన్యను బరిగ్రహించుట ధర్మవిరుద్ధ మని తా నధర్మమునకుఁ బాలుపడుచో లోకప్రవృత్తి విపరీత మగు నని వాక్రుచ్చెను. "ఐనచో, నాతండ్రి చెప్పిన నంగీకరింతువా?" యని యయాతి నడుగ నాతఁ డంగీకరింతు ననెను. వెంటనే దేవయాని తండ్రిని బిలిపించి విషయ మంతయుఁ జెప్పెను. శుక్రాచార్యుఁడు వారివివాహ మధర్మము కాకుండునట్లు వర మను గ్రహించి వారికి వివాహ మొనరించి తన కూఁతుతోపాటు శర్మిష్ఠను సఖులను రాజున కొప్పగించి పడుక తక్కఁ దక్కిన సమస్తసుఖములు నామె కొసంగు మని చెప్పి యయాతి నొప్పించి శుక్రాచార్యుఁడు వారందరిని యయాతితోఁ బంపివేసెను. కాలక్రమమున యయాతి దేవయానివలన యదుతుర్వసు లను కుమారులం గాంచెను.

శర్మిష్ఠ యౌవనవతియై తనయంద మంతయు నడవిని గాచిన వెన్నెల కాఁగా దుఃఖించుచుఁ దనకుఁ బతి లేఁడయ్యె నని కృశించుచు యయాతితోడి సంగమము మనసునఁ గోరి యుండఁగా నొకనాఁడు దైవికముగా నామె యొంటరియై యున్నప్పుడు యయాతి యొంటరిగా నరుదెంచెను. అపుడు శర్మిష్ఠ చేతులు జోడించి నమస్కరించి తనకు సంగమసుఖ మిమ్మని ప్రార్థించెను. "శయన సుఖముతక్క మిగిలిన సుఖములు నీ కిమ్మని శుక్రుఁడు నా కాదేశించినాఁడు. దానికి విరుద్ధ మొనరించిన నసత్యదోషము నాకువచ్చు" నని యయాతి పలుక శర్మిష్ఠ "దేవా! ప్రాణవిత్తమాన భంగములందు వివాహవధాసమయములను బొంకవచ్చు ననుట ధర్మబద్ధము కావున నన్నేలు" మని పైఁబడెను. అసదృశరూప యౌవనవిలాసిని యగునామె కా మహారాజటనే యపుడే యామె కోరిన కామసుఖము నపార మొసంగి గర్భము నిలిపి చనెను.

కాలక్రమమున శర్మిష్ఠకుఁ గొడుకుపుట్టి పెరుగుచుండ దేవయాని చూచి యా కొడుకెట్లు పుట్టె నని శర్మిష్ఠ నడిగెను. ఒకమునీశ్వరుని దయచేఁ గలిగె నని శర్మిష్ఠ బొంకెను. దేవయాని యది నిజమని నమ్మి వెడలిపోయెను. యయాతి యతి రహస్యముగా శర్మిష్ఠాసంగమ మొనరింప నామెకుఁ గ్రమముగా నాతనివలన ముప్వురుపుత్రు లుదయించిరి.

కాలక్రమమున నొకనాఁడు శర్మిష్ఠాయయాతుల గుట్టు బట్టబయలు కాఁగా దేవయాని సమస్తము నెఱింగి తండ్రికడకుఁ బోయి తనభర్తయగు యయాతి యధర్మమున ధర్మమునకుఁ గీడు కలిగించి, ఆసురపద్ధతి నాసురియందు ముగ్గురుకొడుకులఁ గని తన కవమానము కల్గించెనని యేడ్చెను. శుక్రుఁడు కోపముతో వచ్చి యయాతిం జేరి "నీవు యౌవనగర్వమున రాగాంధుఁడవై నాకూఁతున కప్రియము చేసితివి. జరాభారపీడితుఁడవు కమ్మని శపించెను. యయాతి ఖేదపడి తనకుఁ గామసుఖము తీరలే దని శాపముఁ బాపుమని ప్రార్థించెను. శుక్రా చార్యుఁడు "నీ ముదిమి నీ కొడుకునకిచ్చి యాతని యౌవనము నీవు తాల్చి రాజ్యసుఖంబు లనుభవింపవచ్చు. తుదిని నీముదిమి నీవు తాల్చి నీ కుమారునియౌవన మాతని కీయవచ్చు. అట్లొడంబడిన కుమారునికే నీవు రాజ్య మీయవలయు. అతఁడే వంశకర్త యగు" నని శాపము మార్చి కూఁతు నూఱడించి యయాతిఁ దృప్తిపఱచి వెడలిపోయెను. *

## శుక్రాచార్యుఁడు బలిచక్రవర్తికి నీతి బోధించుట

శుక్రుడు బలికి సమస్త నీతులను బోధించి యాతనినిఁ జక్రవర్తి నొనరించి దేవతలయు, ఇంద్రునియు, దిక్పాలకులయు గర్వ మణఁపఁ జేసి యాతనిచే శతాధికములగు యజ్ఞములు చేయించి దానము లొన రింపఁజేసి సత్యము, దయ, ధర్మము, త్యాగము, యోగము పంచప్రాణ ములుగా నొనరించి జగజ్జేగీయమానముగాఁ దనయాచార్యత్వము నిర్వ హించెను.

---

* భారతము ఆదిపర్వము భాగవతము, నవమస్కంధము.

ఇట్లుండ విష్ణుమూర్తి వామనుండై బలిని యాచింప వచ్చుటయు, బలి వామనుఁడు కోరిన మూఁడడుగులభూమిని దానముచేయ నంగీకరించుటయు జరిగెను. అపు డీసంగతి విని తన దివ్యదృష్టిని జరుగఁబోవున దెఱిఁగినవాఁ డయ్యె శుక్రాచార్యుఁడు తనవిధి తాను నిర్వర్తింపఁ దలఁచి బలిని జేరి యిట్లు పలికెను. "దనుజేంద్ర! ఈ పొట్టివాఁడు చాల గట్టివాఁడు. బడుగు బాపనయ్య కాఁడు. దేవకార్యము సాధించుటకై యీవటువు రూపమున నీకడకు వచ్చినాఁడు. ఈ సంగతి నీ వెఱుంగక యీతనికి నీవు దాన మిచ్చెద నంటివి. ఇచ్చితివా రాక్షసలోకమున కంతకు ముప్పు తెచ్చినవాఁడవే యౌదువు. ఈతఁ డీ మూఁ డడుగులగు దానము మిషచే నీ లక్ష్మి, నీ తేజము, నీ యిల్లు, నీ యైశ్వర్యము, నీ సమస్తముఁ గొనిపోయి యింద్రుని కిచ్చును. మూఁడుపాదములతో మూఁడు లోకముల నాక్రమించి నిన్నుఁ బాతాళమునఁ గూల్చును. ఇచ్చెదనని యీయకున్నచో నరకమే వచ్చును. కాని, దానిని దప్పించుకొన నీవు సమర్థుఁడవు. ఏ దానమున వినాశము సంభవించునో యది దానమే కాదని పెద్ద లందురు. గృహస్థుఁ డగువాఁడు తనయింటఁ గలధన మైదుభాగములుగాఁ జేసి కామము, అర్థము, ధర్మము, యశము, ఆశ్రిత జనము అనునైదిటికి సమముగాఁ బంచవలయును. అంతేకాని తనకు మాలినధర్మము ధరణి లేదు. "బహ్వృచగీత" ఈభావమునే తెలుపును. వినుము. అంగీకరించినను, అఖిలము పోవునపుడు లే దనిన అసత్యము కాదు. ఆత్మ యనువృక్షమునకు అసత్యము మూలము. ఐనను ఆత్మ చెడదు. ఆత్మ యనువృక్షమునకు సత్యము పుష్పఫలములు. క్రమాను చెడుటతో పుష్పఫలములును పోవును. ఫలపుష్పములు లేకపోయినను వృక్షము మూలముతో వృద్ధిపొందును. కావునఁ దాను నశింపకుండు పక్షమున దానము చేయవలయును గాని తానే పోవునపుడు దానము చేయుట తెలివిగలపని కాదు. మఱియును

వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్తమానభంగమందుఁ
జకితగోకులాగ్రజన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము పొందఁ దధిప!

నేఁ జెప్పినమాటలు పాటించి కులము, రాజ్యము, తేజము నిలుపు కొనుము. ఈ దానము గీనము మానుము."

ఆ మాటలు విని బలిచక్రవర్తి "ఆచార్య! నీవు నిజము చెప్పితివి. గృహస్థులకు నీవు చెప్పినదే పరమధర్మము. కాని, నే నీదాన మిచ్చి తీరెద" నని పలికి శుక్రుని పలుకులు పాటింపఁ డయ్యెను. కాని, శుక్రాచార్యుఁ డొనరించిన హితబోధవలన నాతఁ డాగతానాగతవర్తమానవేది యాచార్య ధర్మనిర్వహణబుద్ధి యని వెల్లడియైనది.

## ఔశనససంహిత

ఉశనసుఁడు అనులోమప్రతిలోమజాత్యంతర వివాహములనుగూర్చి చెప్పినధర్మములు ఔశనస సంహిత యని ప్రసిద్ధిగాంచినవి. ఈ సంహిత పూర్తిగా లభింప లేదు. లభించిన సంహితలో ఆరంభమున "అతఃపరం ప్రవక్ష్యామి జాతివృత్తివిధానకం, అనులోమవిధానం చ ప్రతిలోమవిధిం తథా" అని కలదు. [ఇంతకుఁ బూర్వ మేదియో చెప్పి యుండ వచ్చు. ఈ సంహితనే ఔశనసధర్మశాస్త్రమనియు, ఔశనసస్మృతి, శుక్ర స్మృతియనియు నందు రని తుదిఁగలదు.] ఇందు ౫౧ శ్లోకములు మాత్రమున్నవి ౫౧ వ శ్లోకము:

"ఏతత్సంక్షేపతః ప్రోక్తం జాతివృత్తివిభాగశః,
జాత్యంతరాణి దృశ్యంతే సంకల్పాదిత ఏవ తు."

## ఔశనసస్మృతి

ఇదియే ప్రధాన మగు శుక్రధర్మశాస్త్రము. శౌనకాది మహామునులు భార్గవుఁడగు ఉశనసునిఁజేరి ధర్మశాస్త్ర వినిర్ణయ మొనరింపు మని ప్రార్థించిరి. ధర్మతత్త్వవిదుఁ డగు ఉశనుఁడు ధర్మార్థకామమోక్షహేతువు, పాపనాశనకరము నగుధర్మశాస్త్రమును మొదటఁ దండ్రికి నమస్కరించి ప్రారంభించి చెప్పెను. మొదటి అధ్యాయమున బ్రహ్మచారిధర్మసార వర్ణనము, రెండవ అధ్యాయమున బ్రహ్మచారిశౌచాచారవర్ణనము,

మూఁడవఅధ్యాయమున బ్రహ్మచారికి సంబంధించిన యనేకవిషయములవర్ణనము, గాయత్రీమంత్రసారవర్ణనము, నిత్యనైమిత్తిక విధివర్ణనము, నాలుగవ అధ్యాయమున శ్రాద్ధవిషయవర్ణనము, ఐదవయధ్యాయమున అదేవిషయముయొక్క వివరణము, ఆఱవఅధ్యాయమున అశౌచవర్ణనము, ఏడవఅధ్యాయమున గృహస్థు లొనరింపఁదగిన ప్రేతకర్మవిధివర్ణనము, ఎనిమిదవఅధ్యాయమున ప్రాయశ్చిత్తవర్ణనము, తొమ్మిదవఅధ్యాయమున ఆ విషయముయొక్క విపులీకరణము అనువిషయములు ఔశనసస్మృతిలోఁ గలవు. మచ్చు శ్లోకములు:

"కృతోపనయనో వేదా నధీయాత ద్విజోత్తమః,
గర్భాష్టమే వ్యష్టమే వా స్వ సూత్రోక్తవిధానతః
దండీ చ మేఖలా సూత్రే కృష్ణాజినధరో మునిం
భిక్షాహారో గురుహితే వీక్షమాణో గురోర్ముఖమ్

.... .... .... ....

.... .... .... ....

ఉపాసనే గురూణాం చ సాంధ్యయో రుభయోరపి,
ఉపవీతీ భవేన్నిత్యం విధి రేషః సనాతనః.

.... .... .... ....

.... .... .... ....

అమావాస్యాయాం యో బ్రాహ్మణం సముద్దిశ్య పితామహమ్,
బ్రాహ్మణీస్త్రీం సమభ్యర్చ్య ముచ్యతే సర్వపాతకైః.
అమావాస్యాం తిథిం ప్రాప్య యమమారాధయేద్భవమ్,
బ్రాహ్మణానాం భోజయిత్వా స్సర్వపాపైః ప్రముచ్యతే.
కృష్ణాష్టమ్యాం మహాదేవం తథా కృష్ణచతుర్దశీం,
సంపూజ్య బ్రాహ్మణముఖైః సర్వపాపైః ప్రముచ్యతే.
త్రయోదశ్యాం తథా రాత్రౌ సోపహారం త్రిలోచనమ్,
దృష్ట్వైవ ప్రథమో యామో ముచ్యతే సర్వపాతకైః.
సర్వత్ర దానగ్రహణే ముచ్యతే సోమయాగతః.

శాంత్యాచ దక్షిణాం గృహ్ణన్ హిరణ్యప్రతిమా మపి,
అయుతేనైవ గాయత్ర్యా ముచ్యతే సర్వపాతకైః.

## శుక్రధ్యానము

శ్లో. జటిలం సాక్షసూత్రం చ
వరదండ కమండలుమ్,
శ్వేతవస్త్రావృతం శుక్రం
ధ్యాయేద్దానవపూజితమ్."

## శుక్ర స్తుతి

శ్లో. శుక్ర శ్శుభగ్రహ శ్శ్రీమాన్
వర్షకృద్వర్ష విఘ్నకృత్,
తేజోనిధిః జ్ఞానదాయీ
యోగీ యోగవిదాంవరః

దైత్యసంజీవన శ్శాంతో
దైత్యనేత్రోశనాః కవిః,
నీతికర్తా గ్రహాధీశో
విశ్వాత్మా లోకపూజితః.

శుక్ల మాల్యాంబరధరః
శ్రీ చందన సమప్రభః,
అక్షమాలాధరః కావ్యః
తపోమూర్తి ర్ధనప్రదః."

*

## శుక్రాష్టోత్తరశతనామస్తుతిః

"శ్లో॥ శుక్ర శ్శుచి శ్శుభగుణ శ్శుభద శ్శుభలక్షణః,
శోభనాక్ష శ్శుభ్రరూప శ్శుద్ధ స్ఫటిక భాస్వరః.
దీనార్తిహారకో దైత్యగురుర్దేవాభినందితః,
కావ్యాసక్తః కామపాలః కవిః కల్యాణదాయకః.
భద్రమూర్తి ర్భద్రగుణో భార్గవో భక్తపాలనః,
భోగదో భువనాధ్యక్షో భుక్తిముక్తి ఫలప్రదః.
చారుశీల శ్చారురూప శ్చారుచంద్ర నిభాననః,
నిధి ర్నిఖిల శాస్త్రజ్ఞో నీతివిద్యా ధురంధరః.
సర్వలక్షణసంపన్నః సర్వావగుణవర్జితః,
సమానాధిక నిర్ముక్తః సకలాగమపారగః.
భృగు ర్భోగకరో భూమీసురపాలనతత్పరః,
మనస్వీ మానదో మాన్యో మాయాతీతో మహాశయః.
బలిప్రసన్నోఽభయదో బలీబల పరాక్రమః,
భవపాశ పరిత్యాగో బలిబంధ విమోచకః.
ఘనాశయో ఘనాధ్యక్షో కంబుగ్రీవః కళాధరః,
కారుణ్యరససంపూర్ణః కల్యాణగుణవర్ధనః.
శ్వేతాంబర శ్శ్వేతవపుః చతుర్భుజ సమన్వితః,
అక్షమాలాధరోఽచింత్యో అక్షీణగుణభాసురః.
నక్షత్ర గణ సంచారో నయదో నీతిమార్గదః,
హర్షప్రదో హృషీకేశః క్లేశనాశకరః కవిః.
చింతితార్థప్రద శ్శాంతమతిశ్చిత్తసమాధికృత్,
ఆధివ్యాధిహరో భూరివిక్రమః పుణ్యదాయకః.
పురాణపురుషః పూజ్యః పురుహూతాదిసన్నుతః,
అజేయో విజితారాతిః వివిధాభరణోజ్జ్వలః.

కుందపుష్పప్రతీకాశో మందహాసో మహామతిః,
ముక్తాఫలసమానాభో ముక్తిదో మునిసన్నుతః.
రత్నసింహాసనారూఢో రథస్థో రజత ప్రభః,
సూర్యప్రాగ్దేశసంచారః సురశత్రుసుహృత్ కవిః.
తులావృషభరాశీశో దుర్ధరో ధర్మపాలకః,
భాగ్యదో భవ్యచారిత్రో భవపాశవిమోచకః.
గౌడదేశేశ్వరో గోప్తా గుణీగుణవిభూషణః,
జ్యేష్ఠానక్షత్ర సంభూతో జ్యేష్ఠః శ్రేష్ఠః శుచిస్మితః.
అపవర్గప్రదోఽనంత స్సంతానఫలదాయకః,
సర్వైశ్వర్యప్రద స్సర్వగీర్వాణగణసన్నుతః."

---

# మహర్షుల చరిత్రలు

## శ్వేతకేతు మహర్షి

### జననము

పూర్వము మహాతపస్వియు, మహాతేజస్వియు, మహాస్వాధ్యాయ వేత్తయు నగు ఉద్దాలకుఁ డనుమహర్షి యుండెను. అతఁడు మంత్రద్రష్టయు, మంత్రవేత్తయు, మంత్రమహితుఁడును. అతనికి ధర్మపత్నియందుఁ దొలుత సుజాత యనుకూఁతురు కలిగెను. యుక్తవయసు వచ్చినపిదప నుద్దాలకుఁ డామెను ఏకపాదుఁ డనుమహనీయ తపోనిధి కిచ్చి వివాహముఁ గావించెను. ఆ పుణ్యదంపతులకే అష్టావక్ర మహర్షి యుద్భవించెను. సుజాతకు అష్టావక్రుఁడు జనించిన వేళనే సుజాతతల్లియు ఉద్దాలకునిభార్యయు నగు సాధ్వికి నొక కుమారుఁడు కలిగెను. అతఁడు స్వచ్ఛధావళ్యయుత మగుశరీరముతోఁ బుట్టుటచేఁ దండ్రి యాతనికి శ్వేతకేతుఁ డనునామము నొసంగి జాతకర్మాదుల నొనరించెను.

### మాతుల భాగినేయులు

సమానవయస్కులు సమానబుద్ధియుతులు నగు శ్వేతకేతుఁడు, అష్టావక్రుఁడు మాతులభాగినేయు లగుట సుజాతచేతను సుజాతతల్లిచేతను మిగుల లాలింపఁ బడుచుండిరి. జనకమహారాజు నాస్థానమున కేగి వందితోడి వాదమున నోడి యేకపాదుఁడు జలమజ్జితుఁడై యుండుటచే అష్టావక్రశ్వేతకేతు లిరువురు ఉపనీతులై ఉద్దాలకునికడనే సమస్త వేద శాస్త్రములు నభ్యసించుచుండిరి. అష్టావక్రుఁడు బాల్యముకతమున ఉద్దాలకుఁడే తండ్రి యనియు శ్వేతకేతుఁడు భ్రాత యనియుఁ భావించుచుండెను. ఒకనాఁడు అష్టావక్రుఁడు చనవుబలిమిని ఉద్దాలకునియొడిలోఁ గూర్చుండెను. అదిచూచి శ్వేతకేతుఁ "ఓరీ! నాతండ్రియొడిలో నీ

వేల కూర్చుంటివి? నీవు నీ తండ్రికడకుఁ బొమ్ము" అని యాతనిని గెంటివేసి తాను దండ్రియొడిలోఁ గూర్చుండెను. అష్టావక్రుఁ డేడ్చుచుఁ దల్లికడ కేఁగి జరిగిన సంగతి చెప్పి తనతండ్రి యెక్కడఁ గలఁడో తెల్పుమని కోరెను. ఆమె జనకసభలో వాదమున నోడి జలమజ్జితుఁడై యాతని తండ్రి యుండె నని చెప్పెను. "ఐనచో నే నేగి నాతండ్రిని విడిపించి తెచ్చుకొందును. అనుమతింపు" మని తల్లినిగోర నామె "బాలవాక్యము బ్రహ్మవాక్యము. ఏమో! తేజస్వియగుబాలుఁ డంతకుఁ సమర్థుఁడు కాఁడనుకొననేల?" యని యాతని కనుమతి నొసంగెను.

వెంటనే అష్టావక్రుఁడు మేనమామయగు శ్వేతకేతుని కడకుఁ బరుగునఁ బోయి యాతఁడు తన్ను గెంటివేసి యవమానించినసంగతి యప్పుడే మఱచి, "మామా! మన మిద్దఱము జనకచక్రవర్తిసభ కేగి వంది నోడించి నా తండ్రిని విడిపించుకొని వత్తము. రమ్ము. వందిని గిందిని పందిని జయింపలేమా మనము?" అనెను. ఆతఁడును తప్పక పోదము రమ్మనఁగా ముక్కుపచ్చలారని యా ముద్దుబిడ్డ లిరువురుఁ జెట్టాపట్టాలు వేసికొని బాలసూర్యులవలెఁ బయలుదేఱి జనకసభను జేరి వారి వాక్చమత్కృతులచే ద్వారపాలురను జనకుని రంజింపఁ జేసిరి. అష్టావక్రుఁడు వాదమున వంది నోడించి జనకుని గౌరవము లంది తండ్రిని విడిపించుకొని తండ్రియాజ్ఞచే సమంగానదిలో మునిఁగి నిర్వక్రుఁడు దివ్యసుందరుఁడునై తనతోఁ దుల్యుఁ డని జనకాదులచే ననిపించుకొన్న మేనమామ యగుశ్వేతకేతునితో విజయియై యింటికి విచ్చేయఁగా నెల్లరు మాతులభాగినేయుల లోకాతీతశక్తుల కచ్చెరువందిరి.

శ్వేతకేతుఁ డచిరకాలముననే సర్వవేదశాస్త్రములను తద్రహస్యములను, ధర్మమర్మములను దెలిసికొని పున్నమచంద్రునివలె షోడశకళాపరిపూర్ణుఁడై ప్రకాశింపఁ జొచ్చెను.

## శ్వేతకేతునివిజ్ఞానము

శ్వేతకేతుఁడు బ్రహ్మచర్యదీక్ష వహించి మహాతపస్సు చేసెను. ఆ పిమ్మట నాతఁడు బ్రహ్మజ్ఞానమును గడించి వేదతత్త్వము, క్రియా

స్వరూపము, కర్మఫలత్యాగములను, ఆత్మజ్ఞానమును సంపాదించెను. అతఁడు ప్రాజ్ఞులలో ప్రాజ్ఞుఁడు, పండితులలో పండితుఁడు, జ్ఞానులలో జ్ఞాని, నిష్ఠాగరిష్ఠులలో నిష్ఠాగరిష్ఠుఁడు తపస్వులలో తపస్వియై బ్రహ్మవర్చసము, జ్ఞానతేజము, విజ్ఞానప్రకాశము తన్నావరింప బాలసూర్యునివలెఁ బ్రకాశించుచుండెను.

ప్రాజ్ఞుఁ డగునుద్దాలకుఁడు రూపగుణవిజ్ఞానసంపన్నుఁడగు కొడుకును జూచి "నాయనా! నీవు వివాహయోగ్యుఁడవై యున్నావు. బ్రహ్మచర్యము, తపస్సు, విద్య, విజ్ఞానము, రూపము, గుణము-వీనిని సంపాదించినపిదప ఆత్మజ్ఞానమును గుర్తెఱిఁగిన విప్రుఁడు వినయవివేకగుణశాలిని యగుకన్యను బరిణయమాడి యుత్తమగృహస్థధర్మమును పాటించి సర్వఋణములను దీర్చి సన్న్యస్తచిత్తుఁడై సర్వేశ్వర సాన్నిధ్య మందుట సద్బ్రాహ్మణలక్షణము కావున, నీవును పావనముగ జీవనము గడప గృహస్థుఁడవు కమ్ము" అని పలికెను. శ్వేతకేతుఁడు తండ్రిని గాదనఁజాలక యుత్తమకన్యక లభింపఁగనె తాను దప్పక పరిణయమాడుదు ననిచెప్పి తండ్రి నలరించి బ్రహ్మచర్యవ్రతమును బరిపాలించుచునుండెను.

## శ్వేతకేతుని వివాహము

ఆ కాలమున మహాతపస్వి, వేదవేత్త, శాస్త్రవిజ్ఞుఁడు, ఆచారవంతుఁడు, ధర్మజ్ఞుఁడు నగుదేవలమహర్షి యా పరిసరప్రాంతముననే నివసించుచుండెను. ఆ మహర్షికి ధర్మపత్నివలన సువర్చల యను నొక కూఁతురు జనించి చక్కనిచుక్కగాఁ బెరుగుచు పుత్తడి బొమ్మవలెఁ బొలుపొందుచుండెను. ఆమె తండ్రికడ సర్వవిషయములందును జక్కని వైదుష్య మార్జించెను. అందచందములతో నద్వితీయముగ నలరారు నామెకు విద్యావినయవిజ్ఞానసంపద బంగారమునకుఁ దావి యబ్బిన చందమున నబ్బెను. ఇంతచక్కని చుక్కకు నింతవిజ్ఞానరాశికిఁ దగిన వరు నెక్కడనుండి తెత్తునా యని దేవలమహర్షి తలపోయుచుండెను. తండ్రితలపోఁత తనయ గుర్తెఱింగి "తండ్రీ! నీవు నాకుఁ దగినవరు నన్వేషింపఁ దలపోయుచుండుట నే నెఱింగితిని. కాని, నాకొక్కకోరిక

గలదు. అది నీవు తీర్చకతప్పదు. గ్రుడ్డివాఁడు గ్రుడ్డివాఁడు కాని వాఁడు వీకకాలముననేయైన మహాత్ముఁ డెవఁడో యాతనికే నీవు నన్నీయ వలయును. అన్యున కీయవలదు'' అని పలికెను. అందులకు దేవ లుఁడు "బిడ్డా! నీ కోరిక లోకవిరుద్ధము. అంధుఁడై కానివాఁడు, అంధుఁడు కాక యైనవాఁడు-చిత్రమైనమాటలు. అట్టివానిని నీవే చూచుకొనుము. వేదవిదులు, ఆచారవంతులు, ధర్మపరులు, తపశ్శీ లురునగు వటువరులను నేను బిలిపింతును. నీ కోరిక ననుసరించి వారిలో నొక్కనిని నీవే యెంచుకొను'' మని పలికెను. సువర్చల యట్లే యొనర్పు మని తండ్రికిఁ జెప్పెను.

దేవలమహర్షి తనశిష్యుల నెల్లరినిఁ బిలిచి "వత్సలారా! జన్మకుల రూపగుణప్రవర్తనలచే, నుత్తములై వేదాధ్యయనపరులై, బ్రహ్మ చర్య వ్రతనిష్ఠులై, తల్లిదండ్రు లుండి వివాహేచ్ఛ గలిగిన వటువరులను సగౌరవముగాఁ దీసికొని రండు. వారిలో నొక్కనిని నాపుత్రిక యగు సువర్చల పరిణయమాడు నని చెప్పి యందుల కంగీకరించిన వారినే తీసికొని రం'' డని పంపెను. దేవల శిష్యు లాశ్రమముల కేఁగి సువర్చ లావృత్తాంతము, దేవలునికోరిక యెఱిఁగించి పెక్కురు వటువరులను దీసికొని వచ్చిరి.

దేవలుఁడు వారిని సమాదరించి సువర్చలం బిలిచి "తల్లీ! వీరు వేదవేదాంగవేత్తలు, విద్యాసంపన్నులు, సత్కులీనులు, సచ్ఛీల యుతులు, వివాహసంతానేచ్ఛ గలవారు. మహావ్రతు లగువీరిలో నొక్కనిని నీవు వరింపుము'' అని పలికెను. అందచందములతో నల రారు నా యిందువదన, బంగారమువంటి యొడలికాంతులు విరాజిల్ల, విద్యావినయవివేకవతియై వా రెల్లరికి నమస్కరించి "వటువరులారా! మీలో అంధానంధుఁ డేకకాలముననే యైనమహనీయుఁ డెవఁడైన మన్న నాతనిని నేను వరించెదను. అన్యులను వరింపఁజాలను. మన్నింపుఁ'' డని పలికెను. ఆమెమాటలు విని పెక్కురు తబ్బిబ్బై "యిది యేమి? అంధుఁ డనంధుఁ డెట్లగును? అనంధుఁ డంధుఁ డెట్లగును? కన్య లక్షణవతియే కాని, వక్రబుద్ధి యని యామెగొంతెమ

కోరిక చెప్పక చెప్పుచున్నది. ఈమెతో మనకేల ?'' యని ముని కుమారు రెల్లరు వచ్చిన త్రోవఁబట్టి పోయిరి. కాని, తండ్రిపనుపున వచ్చి శ్వేతకేతుఁడు దేవలుని సమీపించెను.

దేవలుఁడు శ్వేతకేతు నధికముగ నాదరించి సువర్చలం బిలిచి "అమ్మా! ఈతఁ డుద్దాలకపుత్రుఁ డగుశ్వేతకేతువు. ప్రాజ్ఞుఁడు, విద్యా వినయవివేకనిధి, తపస్వి, ధర్మజ్ఞుఁడు. బ్రహ్మనిష్ఠుఁడు. ఈతఁడు నీకుఁ దగినపతి యని నాకుఁ దోఁచుచున్నది. తరువాత నీయిష్ట" మనెను. సువర్చల యాతనిపైఁ దీవ్రదృష్టి పాఱించెను. ఆమె మాటాడకుండఁ గనే శ్వేతకేతుఁడు "సుందరీ! యెందుల కీసందియము? నేను నీకొఱకే వచ్చితిని. నీవు నా దానవే. సందియ మందకుము. నేను లోకవాస నలఁ దగులక లోకవిషయముల నంధుఁడనై యున్నాను. కాని సంశయరహిత మగుజ్ఞాన చక్షువుఁ గలవాఁడ నగుటఁ బద్మపత్రములవలె నాకను లెంత విశాలములో తిలకింపుము. ఇందువదనా! నీవు న న్నందుము. నిన్ను నా డెంపమునకు హత్తుకొందును. మఱియు వినుము. జగమంతయు మిథ్య. ఇందు కనుట, వినుట, తాకుట, మూర్కొనుట, మాటాడుట, కర్మలు చేయుట, మనస్సుచే సంకల్పిం చుట, బుద్ధిచే సత్యము నెఱుంగుట మున్నగుకార్యకలాప మంతయు మిథ్య యని యే జ్ఞాననేత్రమునకుఁ దెలియునో ఆ జ్ఞాననేత్రము లేని వాఁడు గ్రుడ్డివాఁడు. అది నాకుఁ గలదు, కనుక నేను గ్రుడ్డిని కాను. మఱి గ్రుడ్డిని! ఎట్లన, లోకులదృష్టిలో వారికివలె నేను వస్తువులఁ జూచుట లేదు. అనఁగా వారియజ్ఞానదృష్టి నాకు లేదు. కావున, వారి భావనలో నేను గ్రుడ్డివాఁడను. ఈ విధముగ నొకేక్షణమున నేను గ్రుడ్డి వాఁడను, గ్రుడ్డివాఁడను గానివాఁడను. ఇంకను వినుము. లోకదృష్టిని నేను నిత్యనైమిత్తికకర్మ లాచరించుచునే యున్నాను. కాని, ఆత్మ దృష్టిని నేను నిష్క్రియుఁడను. ఆ కర్మలఫలము న న్నంటదు. కార్య మగుప్రపంచమునకుఁ గారణ మగుపరమాత్మను నేనే యని యెఱింగిన వాఁడ నగుట నేను బరమశాంతుఁడనై యున్నాను. మఱియు నేను గర్మాచరణమునను గర్మఫలత్యాగమునను మృత్యువును జయించి యమృతుఁడనై జ్ఞానప్రాప్త మగునాత్మానందమున మదమాత్సర్యకామ

క్రోధాదులు లేక ప్రశాంతస్థిరచిత్తుఁడనైతిని. నీకు నేనే భర్తను. నీవే నాభార్యవు. అది నా కిదివఱకే విదిత మగుట నింతదూరము వచ్చితిని. నచ్చితివా ?" యని యూరకుండెను.

సువర్చల సిగ్గుపడి వెనుకకుఁ దగ్గెను. దేవలుఁ డానందించి "సువర్చలా! నచ్చెనా? తథాస్తనవచ్చునా!" యని వలుకరించెను. సువర్చల మఱింత సిగ్గుపడి లోనికేఁగి సిగ్గుపెందెరలఁ జీల్చుకొని నచ్చిన వరుఁ డని తండ్రిని హెచ్చరించెను. దేవలమహర్షి వెంటనే సగౌరవముగా ఉద్దాలకుని, బంధువర్గమును, ఋషివర్గమును, శిష్యవర్గమును బిలిపించి ముహూర్తనిశ్చయ మొనరించి సర్వసంభారములను సమకూర్చి శాస్త్రోక్తముగ సర్వమునిజన సమక్షమున సువర్చలను శ్వేతకేతున కిచ్చి వివాహమహోత్సవము నిర్వర్తించెను. ఆ దివ్యమంగళ సమయమున "హృత్పుండరీక నివాసుఁడు, సర్వభూతాత్మకుఁడు, సర్వశోభా సముపేతుఁడు నగుశ్రీహరియే యీ శ్వేతకేతురూపమున నిల్చియున్నాఁడా? ఆ చల్లనితల్లి మహాలక్ష్మి భూలోకవాసుల లోచనములకుఁ బర్వము గావింప నిటు సువర్చలారూపమున విచ్చేసియున్నదా? లేనిచో ఈదంపతుల ఆ రూపమునకు దివ్యమంగళవిగ్రహత్వ మెట్టులు వచ్చు?" నని యెల్లరు నమకొనఁ జొచ్చిరి.

అంత దేవలుఁడు "శ్రీధవుఁ డగుమాధవుని ప్రీతికొఱ కీకన్యాదానముఁ జేసితిని. ఆతఁడు సంతోషించుఁగాక! నాపుత్రియు నీ పత్నియునగు సువర్చల పతివ్రతయై పుట్టినయింటికి మెట్టినయింటికి ఖ్యాతి గొనితెచ్చుఁగాక!" యని యామెను శ్వేతకేతునకుఁ దలిదండ్రులకు నొప్పగించెను.

## ఆశ్రమనిర్వర్తనము

శ్వేతకేతుఁడు విధ్యుక్తవివాహకార్యకలాప మంతయు ముగిసిన పిమ్మట భార్యను దీసికొని తల్లిదండ్రులయు, అత్తమామలయు దీవెన అంది వేఱుచోట నాశ్రమమును నిర్మించుకొని యందు గృహస్థధర్మము నవలంబించెను.

తొలుత నాతఁడు పత్నితో "కాంతా! వేదోక్తవిధులాచరించి మనము దేవపితృఋషి ని ఋణములను దీర్పవలయును. నేను నీవు నను ఖావములతో నున్నాము కనుక మన కీ కర్మకలాపము తప్పదు. నీవు నాతోను నేను నీతోను వీని నాచరించి పిదప జ్ఞానాగ్నియందు వానిని భస్మమొనరింతము. ఉత్తము లేది చేయుదురో సామాన్యు లది చేయుదురు. అందుచేతనే జ్ఞానులును గర్మమానరు. జ్ఞానముచేతనే వారు మానినను అజ్ఞానులు కర్మమానుటలో మాత్రము వాని ననుసరింతురు. దానివలన లోకము కర్మభ్రష్టమై సర్వభ్రష్ట మగును. కావున, మనము లోక శ్రేయమునకు ఆత్మశ్రేయమునకును సద్గృహస్థకర్మము లాచరింత" మని పలికెను. ఆమె సర్వవిధముల నాతనియడుగుజాడలనుబట్టి నడచుచు నుత్తమ సాధ్వియై యుండెను. రత్నముప్రక్క రత్నముచేరిననే శోభించునుగాని మసిబొగ్గు చేరిన శోభింపదుగదా!

## జ్ఞాన బోధ

ఈ విధముగా సువర్చలాశ్వేతకేతు లనుపమాన ధర్మము లాచరించుచు నుత్తమపుత్త్ర సంపదఁ బడసి పితరులను, అనేకయజ్ఞము లొనరించి దేవతలను, తపస్స్వాధ్యాయసత్ప్రవర్తనలచే ఋషులను సంతోషపఱిచి యా పుణ్యదంపతు లాత్మజ్ఞానమున ద్వంద్వాతీతులై భువిపై దివి చూచుచుఁ జూపుచు, అన్నిటికి సాక్షిభూతులై మాత్రము తా ముండి, మానవలోకమున నున్నను మాధవలోకమున నున్నట్లు వర్తించి యపూర్వ దంపతులై యలరారిరి.

ఒకనాఁడు సువర్చల భర్త నిట్లడిగెను. "బ్రహ్మజ్ఞా! నీ వన నెవరు? పాంచభౌతికమై కంటికిఁ గనఁబడు నీ శరీరమా నీవు? కానిచో నీ వను దానితత్త్వమును నిపుణముగఁ దెలుపుము." ఆమెకు శ్వేతకేతుఁ డిట్లనెను. "కాంతా! నీవు నన్ను బ్రహ్మజ్ఞా యని పిలిచితివి. అందులోనే నీవు నన్నెఱిఁగినట్లు స్పష్టము. ఇఁక వేఱే యడుగనేల?" "నీ దేహాంతర్గత మగుఆత్మ నడుగుచున్నాను" అని సువర్చల యనెను "అగుచో, ఆత్మ మాటాడదు, తినదు, కనదు, వినదు, పుట్టదు, చావదు.

శరీరసంబంధమునఁ జేసి ఆత్మకు జననము కలదని యనుకొనునాఁడు దానికి బంధమును గలదు. నీవు నేను, నేను నేను సర్వముః నేను అని యనుకొనునాఁడు శరీరమే లేదు.'' అని శ్వేతకేతుఁడు చెప్పెను. ఆ మాటలు విని యామె "మహాత్మా! నీ వింతప్రాజ్ఞుఁడవై యుండియు నజ్ఞానివలె సమస్త కర్మలు నొనర్చుచున్నావు. సహధర్మచారిణి నగుట నేను నిన్ననువర్తించుచున్నాను. ఇందు నీభావ మేమి? దయతో సెల విమ్ము" అని కోరెను. ఆతఁ డిట్లనెను. "సుదతీ! పెద్ద లాచరించినది పిన్నలకు ఒరవడి యగును. లోకవ్యవహారము సక్రమముగ నడచుట కెల్లరును గర్మ లాచరింపవలయును. కర్మహీనతవలన జాతి నిర్వీర్యమై లోకము చిందరవందర యగుఁను. ధర్మము నశించును. చిన్నచేఁపను మ్రింగుపెద్దచేఁపవలె బలవంతుఁడు బలహీనునిఁ గబళించును. సర్వలోక కర్త భర్త హర్త యగు పరాత్పరున కది యనిష్టము. మఱియు సర్వ జగత్సృష్టియు భగవంతునికిఁ గ్రీడామాత్రము. ఆతని విభూతు లనంత ములు. ఆతని శక్తు లపారములు. సృష్టిస్థితిలయము లను పెనుగహ్వర ముల జీవి చిక్కుకొని యున్నది. జననమరణసంసారరూప మగు బంధ ములఁ దెగద్రెంపుకొని యెవఁ డాత్మజ్ఞానము నందుచున్నాఁడో వాఁడు భగవంతునికిఁ బ్రియుఁడు. అట్లుగాక జనన మరణసంసారప్రవాహ మధ్యమునఁ గొట్టుకొనిపోవుచు దుర్మార్గుఁ డగునిర్భాగ్యుఁడు నరకకూప మున మ్రగ్గుచుఁ దనచుట్టునుగల బంధములఁ ద్రెంచుకొనుటకు బదులు పెంచుకొనుచుండును. దట్టముగ నలముకొన్న యజ్ఞానతిమిరమునఁ బడి యది తన యదృష్టవిశేష మని యహంకరించుచు నిర్భాగ్యుఁ డగు నరుఁడు నిత్యపతనము నందుచునే యుండును. కావున, దేహశుద్ధి కొఱకు ఆత్మజ్ఞానవికాసముకొఱకు, లోకమువారికి ఒరవడి యగుట కొఱకు నేను సత్కర్మాచరణముఁ జేయుచున్నాను. దేహపతనపర్యంతము నట్లొనరించుచునే యుండవలయును.''

ఆ మాటలకు మిగుల నానందించి సువర్చల "దేవా! శబ్దము, అర్థము వీనిని వివరింపు" మని కోరెను. "అక్షర సంపుటి నుచ్చరింపఁగా వెలువడునది శబ్దము. ఆ శబ్దముచేతఁ దెలుపఁబడున దేదియో అది యర్థము. శబ్దార్థములకు నిత్యసంబంధము లేదు. ఉచ్చారణనుబట్టి

పరిస్థితులను బట్టి శబ్దార్థము మాఱుచుండును. కావున, వానికిసంబంధ మున్నది, లేదు'' అని శ్వేతకేతుఁ డనెను. "ఐనచో నది పరస్పర విరుద్ధముగాలేదా?'' యని సువర్చల పలికెను. "కాదు. వైరుధ్యమే మియు లేదు. నే ననుశబ్ద మాత్మపరమైనపుడు సత్యము, అనాత్మపర మైనపు డసత్యము. అందుచే నది సత్యము నసత్యమును. మఱియు బ్రహ్మ సత్యము. జగత్తు మిథ్య. మిథ్య యగు జగత్తు లేదా? ఉన్నది. నిజమున కున్నదా? లేదు. ఇది తథ్యమిథ్యాతత్త్వము. ఇది తెలిసికొనుట కష్టము. కావున, ఆత్మవాచ్యశబ్దార్థము పరమేశ్వరుఁడు, అనాత్మాశ్రితశబ్దార్థములు రెండును మిథ్య" అని శ్వేతుకేతువు బదులు చెప్పెను.

"ఆత్మ, అహంకారము వీనినిగూర్చి తెలుపు" మని సువర్చల యడుగఁగా శ్వేతకేతు విట్లు తెలిపెను. "కాంతా! మట్టియందు ఘట మనుభావ మున్నట్లు, ఆత్మయందు అహంకారము కల్పితమైయున్నది. అచింత్యము, పరము నైనది, ఆత్మవస్తువు. దీనియందు 'నేను నాది, నీవు, నీది, ఇది' అనునవి కల్పితములు. ఈ భావమే అహంకారము. లోకమున నాకాశ మున్నది. కాని రెండింటికి సంబంధములేదు. అదే విధముగాఁ బరిశుద్ధ మగుపర బ్రహ్మము (తెలుప, చూప, శక్యము కానిది) —నుండి జగ ముద్భవించినను దానికి దీనికిని సంబంధము లేదు. మఱియు, ఆకాశమును ముట్ట, పట్ట వీలు లేకపోయినను, వాయువును త్వగింద్రియము చేతను, వాసనను ఘ్రాణేంద్రియముచేతను, చీఁకటి, వెలుఁగు, మేఘములు, నక్షత్రములు మున్నగువానిని చక్షురింద్రియము చేతను మానవుఁడు తెలిసికొనఁగలుగుచున్నట్లు సద్రూప మగు పర బ్రహ్మము ఆకాశమున కాకాశ మని చెప్పఁబడుచున్నను విష్ణ్వాద్యవతారములచేఁ జూడఁబడుచు, బుద్ధిచేఁ జింతింపఁబడుచు నున్నది. జల మొక్కటి యైనను, అది ప్రవహించు తావులను బట్టి రుచి భేదములను బొందుచున్నట్లే ఆత్మవస్తువుకూడఁ బ్రకృతిసంబంధమువలన వివిధ ములుగాఁ దోఁచుచున్నది. ఎచ్చటిపరిశుభ్ర జలమైనను ద్రావి మానవుఁడు తృప్తిపడునట్లు, ఏరూపమున భావింపఁబడుచున్న పరమాత్మను సేవించియు నరుఁ డుత్తమఫలితమును బొందఁగలుగును. పర

మాత్ముఁడు అవాఙ్మనసగోచరుఁ డయ్యు–సాధనోపదేశమార్గసూచక ఉపలక్షణవ్యాకృతిపద్ధతులచే నాతఁడు వేదవేద్యుఁ డగుచున్నాఁడు. పరిశుద్ధజ్ఞానము ఆత్మవిషయికధ్యానముచేఁ గలుగును. దానివలన నుత్తమగతి కలుగును. పరమాత్మ విభూతులు బహుళములు. వాయుదేవుఁడు, అగ్నిహోత్రుఁడు, సూర్యభగవానుఁడుకూడఁ బరమాత్ము నెఱుంగరు. ఆ పరమాత్ముఁడు జగద్వ్యాపి. బ్రహ్మజ్ఞానసంపన్నులు మాత్రమే పరమాత్మ నెఱింగి యది తా మగుచున్నారు ''

శ్వేతకేతుఁ డీ విధముగా నాయాబ్రాహ్మజ్ఞానవిషయములు సమయోచితముగా భార్యకుఁ దెలుపుచు నామెను జ్ఞానవంతురాలిని గావించెను. జ్ఞానసౌభాగ్యమును గాంచిన యా పుణ్యదంపతులట్లు చిరకాలము గృహస్థాశ్రమమున నుండి తుదకు సన్న్యస్తచిత్తులై గోవిందుని పదపద్మముల మనస్సులు నిలిపి మరణానంతర ముత్తమగతులను మోక్షసామ్రాజ్యమును జూఱగొనిరి.*

## శ్వేతకేతుతీర్థము

సమంగానది వెంత సోమకశిబి తీర్థముల సామీప్యమున శ్వేతకేతు మహర్షి తపము చేసినచోటు 'శ్వేతకేతుతీర్థ' మని జగత్ప్రసిద్ధిగాంచెను. ఈ తీర్థప్రదేశమున సకలవృక్షములు సర్వకాల సర్వావస్థలయందు సకల ఫలపుష్పసహితములై బహు రమణీయములై యుండును. ఈ పవిత్రాశ్రమముననే వాగ్దేవత యగు సరస్వతి మానుషదేహధారిణియై శ్వేతకేతునకు దర్శన మొసంగి యాతనికడ నుండి కరుణించెను.*

---

* భారతము; మోక్షధర్మపర్వము.

* భారతము ; అరణ్యపర్వము.

36313